# భక్త తుకారాం

సురవరము ప్రతాపరెడ్డి

మొదటి ముద్రణ

వెల

ఒక రూపాయి

ప్రతులకు :

ఆదర్శ సాహిత్య మాల

17–5–350

కబీర్‌పుర వెలుపల, హైదరాబాదు—2

స్వర్గీయ శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారిని సంస్మరించుతూ ఈ నాటకాన్ని మా సాహిత్యమాల సభ్యుల కందజేస్తున్నాము.

శ్రీ రెడ్డిగారి జీవితకాలంలోనే ఇది ముద్రింపబడినది. కాని ఇంతలో వారు పరలోక గతులగుట వలన ఇంతకాలం ఈ గ్రంథము తెలుగువారి చేతుల్లోకి రాలేకపోయినది. ఇప్పటికైనా దీనిని వెలువరించే సదవకాశం ఆదర్శ సాహిత్యమాలకు కల్గజేసినందుకు శ్రీ ప్రతాపరెడ్డిగారి పుత్రవర్యులైన శ్రీ సురవరము నారాయణరెడ్డిగారికి కృతానేక నమస్కారాలు.

ఈ నాటకాన్ని ప్రదర్శించ వలసినదిగా ఆదర్శ నాట్యకళాపరిషత్తు కార్యదర్శి శ్రీ తిరుమల శేషాచార్యులవారిని శ్రీ ప్రతాపరెడ్డిగారు కోరియుండిరి. స్వర్గస్థులయిన శ్రీ రెడ్డిగారి కోరికను ఇప్పుడైనా మన్నించి వారి ఆత్మకు శాంతి చేకూర్చగలరని ఆదర్శ నాట్యకళాపరిషత్తు వారిని సవినయంగా కోరుతున్నాను.

ఆదర్శ సాహిత్యమాల,
హైదరాబాదు.
20-3-1957.

ఇట్లు
కార్యదర్శి

# పీఠిక

తుకారామ నాటకమును నేను మొదట మూడు చిన్న అంకములుగా వ్రాసి మద్రాసులో నామిత్రులగు శ్రీ పి. వి. రాజమన్నారుగారు సంపాదించిన "కళ" యను మాసపత్రికలో రుధిరోద్గారి మార్గశిర పుష్యఫాల్గుణ సంచికలలో ప్రకటించితిని. తుకారాము నాటకమును తెనుగులో మొదట రచించినది నేనేయనుకొందును. తర్వాత ఒకరిద్దరు రచించి ప్రకటించిరని వింటిని కాని వాటిని చదువలేదు. తుకారాం తెనుగుటాకీ కలదని వింటిని కాని దానిని చూడలేదు. సికింద్రాబాదులో నామిత్రులగు శ్రీయుత బుచ్చయ్యగారును వారి మిత్రులును జగదీశనాట్యమండలిని స్థాపించి యుండిరి. వారు తుకారామ నాటకమును అయిదంకములుగాపెంచి వ్రాసి యియ్యవలెనని తొందరపెట్ట నటులేచేసితిని. హైద్రాబాదులో నొకమహారాష్ట్ర పరిచితుడు మరాటీలో తుకారామ నాటకము కలదనియు, అందు మాస్వాజీని శాక్తేయునిగా సుందరీ ప్రియునిగా చిత్రించిరనియు తెలిపెను. ఆ భావము నాధారము చేసికొని నేనును సుందరిని నాకు తోచినట్లు సృష్టించితిని. ఈ విధముగాపెంచి ఇంచుమించు ౧౯౩౨ లో పై నాట్యమండలికిస్తిని. వారు దానిని మద్రాసు, గుంటూరు, బెజవాడ, సింగరేణి, సికింద్రాబాదు, మున్నగు తావులలో ౧౨ మారులు ప్రదర్శించిరి. తుకారామ ముఖ్యపాత్రధారి శ్రీ బుచ్చయ్యగారే (లాలగూడా రైల్వేలోని యుద్యోగులు). వారు భక్తి శాంతరసముల నుత్తమముగా నభినయించిరి. అతని ప్రకృతిలోనే శాంతము, వినయము, సమృద్ధిగా గలవు. అతడుత్తమ నటవర్గములో జేరినవాడు.

నేను మొదట ఈ నాటకమును గ్రాంథికముగా అరసున్నలు బండి ఱాలువదలక యథామతి వ్యాకరణ నియమోల్లంఘనముసేయక రచించి యుంటిని. కాని నాటకమంతయు కృత్రిమము, అందలి పాత్రసృష్టి కృత్రిమము, అభినయము కృత్రిమము. అట్టిపాత్రధారులు సహజముగా మాటలాడని గ్రాంథికభాషలో వారిని బలవంతపెట్టి మాటలాడించుటయు కృత్రిమమే యగునని భావించుకొని ౧౯౪౫ లో వచనములలోని భాషనంతయు మార్చి నాటకమును తిరుగ వ్రాసితిని. 'వచ్చుచున్నాడు', 'చేయుచున్నాడు' వంటిరూపములను తెనుగువారిలో నెవ్వరును వాడుటలేదు. కావున ఇకముందు 'వస్తున్నాడు', 'చేస్తున్నాడు' అను రూపాలను గ్రాంథికముగా భావించుటయే సరసము. 'వచ్చారు' 'చేశారు' అనునవి చారురూపములుకావు. ఇవి తూర్పు తీరపు జిల్లాలలోనే కలవు. రాయలసీమలో నందరును 'వచ్చినారు' 'చేసినారు' అని విలక్షణముగా నేటికిని పలుకుదురు, తెలంగాణ

మందును ఇంచుమించంతే. ఇట్టివి బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున వాడుకలోనుండు రూపాలు. ఇట్లుచూపి చెప్పుట యేలన నేనవలంబించిన శైలి గ్రామ్యముకాదనియు, శిష్టవ్యవహారమందుండునదనియు, ఇవే యీనాటి గ్రాంధికమనియు పూని నిరూపించుటకే!

పద్యాలు పాటలు పూర్వాచార పరాయణులకు కన్నీటి తుడుపుగా అల్పమాత్రముగా నుండ వచ్చునులే యని యూరపు విమర్శక భావాలను జీర్ణించుకొనిన యాంగ్లభాషా విశారదులు వాదింతురు. అతివాస్తవిక (సర్రియాలిజం) వాదులు పద్యాలు పాటలు కూడనే కూడదని గద్దించి ఖండింతురు. ఎవ్వరేమన్నను తగుపాటిగా పద్యాలును పాటలును ఉండవలెననియే నేను భావింతును. అయితే యవి ఆముక్త మాల్యాదా ముక్తములుగా వసుచరిత్ర పుత్రికలుగా నుండరాదు. ఈ దృష్టితో కొన్ని పద్యాలనిందుంచినాను. భక్తిరసమునకు కీర్తనలు ప్రధానము కావున పాటలను రచింపజాలనందున నటులకు పని కల్పించి సూచించి వదలినాను.

ఇంగ్లీషులో నటేశన్ కంపెనీ తుకారాం జీవితము, వావిళ్ల తుకారాం జీవితము, భక్తవిజయము ఈ నాటకమున కాధారములు.

అంకములు, రంగములు అను విభజనము తొలిగించినాను. రత్నావళిలోని ప్రఘట్టక పదమును రంగములకు మారుగా వాడినాను.

దీనిని రచించిన పాతికేండ్ల తర్వాత ఈనాడిది అచ్చులోనికివచ్చినది. అచ్చు ప్రారంభమగుటతోడనే స్థలాంతరము పోవలసివచ్చెను. అప్పుడు మిత్రులగు పండిత శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి శిరోమణిగారికి తప్పులు దిద్దు శ్రమను కలిగించి వెళ్లితిని. శ్రీ శాస్త్రిగారు పద్యాలలో నేను పాటింపని అరసున్నలను బండిరాలను సవరించి యుంచినాడు. మరియు అయిదారు తావులందు సవరణలు చేసినారు. వారి యుపకృతికి నమోవాకము లర్పించుకొంటున్నాను. ఈనాటికైనను నాటకము ముద్రితమగుటకు మిత్రులగు శ్రీ బొజ్జం నరసింహులుగారి ప్రోద్బలమే కారణము. వారికిని నా నమస్సులు.

కొన్ని అచ్చుతప్పులు పడినవి. తుదిలో సవరణ పట్టిక నిచ్చినాను. దయచేసి దానిననుసరించి సవరించుకొనవలెను.

హైదరాబాదు — సు. ప్ర

విజయ దశమి

౨౮-౯-౧౯౫౨

# సవరణ పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౭ | ౨౪ | నమ్మినవారి | నమ్మినవారికంత |
| ౨౧ | ౧౮ | భాగ్యాబావా | భాగ్యాభావా |
| ౨౨ | ౧౦ | భువస్స్యః | భువస్స్వః |
| ౨౪ | ౨౮ | పిలదించు | పిలిపించు |
| ౩౩ | ౧౨ | నిదశ్శనము | నిదర్శనము |
| ,, | ౧౪ | చెత | చేత |
| ,, | ,, | తిరస్కృతడ | తిరస్కృతుడ |
| ౩౪ | ౨౫ | మంచేవేసి | మంచెవేసి |
| ౩౫ | ౬ | మార్గపతావా | మార్గనతావా |
| ౪౦ | ౨౧ | చేయండ | చేయండి |
| ౪౬ | ౧౧ | గురువుదేవుని | గురుదేవుని |
| ౫౨ | ౧౨ | నేవెళ | నేవేళ |
| ,, | ౧౬ | రపమ | పరమ |
| ౫౩ | ౨ | నీకి | నీకే |
| ౫౬ | ౮ | తండ్రి | తండ్రిని |
| ౫౭ | ౧౬ | ధారిణి | ధారుణి |
| ౬౧ | ౯ | రమాత్మని | పరమాత్ముని |
| ౬౩ | ౫ | పరాధీనదీతా | పరాధీనతా |
| ,, | ౨౦ | అపచారకరము | అపచారము |

ఈ గ్రంథమందు విఠొబా అను పదమంతటను విఠోబా అని చదువు 'నవలెను.

# నాటకములోని పాత్రలు



| | | |
|---|---|---|
| తుకారాం | — | కథానాయకుడు. |
| జిజీబాయి | — | తుకారాం భార్య. |
| మాస్వాజి | — | శాక్తేయుడు,<br>తుకారాంపై స్పర్థకలవాడు. |
| సుందరి | — | మాస్వాజి శిష్యురాలు —వేశ్య. |
| గంగాధరపంత్<br>శంభాజీ | — | మాస్వాజీ శిష్యులు. |
| పండితరావు | — | శివాజీచే తుకారాంపద్దకంప<br>బడినవాడు. |
| కూర్మిదాసు | — | కాపు. |
| రామేశ్వరభట్టు<br>జయరాం | — | తుకారాంను విచారించు<br>బ్రాహ్మణులు. |
| పటేలు | — | గ్రామాధికారి |
| విఠోబా | — | హరిజనుడు, తుకారాం శిష్యుడు. |

ఇద్దరు వంచకులు, వర్తకులిద్దరు, తుకారాం కుమారులిద్దరు, ముగ్గురు మధ్యవర్తులు, ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణులు, ఒక భిక్షుకుడు, ముగ్గురు తైర్థికులు, అందందు వత్తురు.

స్థలము:—ప్రధానముగా దేహూ గ్రామము. భాస్కానాథ పర్వత ప్రాంతము ఇంద్రాణీ నది, అను ప్రాంతాలలోను కొన్ని రంగములున్నవి.

విషయము:—భక్తి ప్రధానమగు తుకారాం జీవితఘట్టములు.

# భక్త తుకారాం

---

## ప్రఘట్టకము ౧

ప్రవేశము—మహారాష్ట్ర యాత్రికులు ధరించు బట్టచెవుల టోపీలతో, బొందెల అంగీలతో, అసిమినంచులతో, ఊర్ధ్వపుండ్రములతో, కాషాయ ధ్వజములతో, మద్దెల, తాళములు వాయించుచు కొందరు పండరి భజనపరులు, పాండురంగనిభజన చేయుచుందురు. వారిలో తుకారాం చప్పట్లు చరచుచు చేరి భజనచేయుచుండును.

తుకారాం వేషము—దగ్గరికి కత్తరించిన మీసములు, బొందెల అంగీ, పెద్దరుమాలు, మెడపై అసిమి సంచి, ఊర్ధ్వ పుండ్రములు, తులసిపూసల మాల, ౪౦ ఏండ్లలోపలి వయస్సును సూచించును. ఒకదిక్కు భజనపరులు పాండురంగని కీర్తనలు పాడుచు నిష్క్రమింతురు.

---

మొదటి వర్తకుడు:- ఓయ్ బావా! తుకారాం ఎక్కడనోయ్! మనవెంబడి వస్తూవస్తూ ఎప్పుడో మాయమైపోయినాడే!

రెండవ వర్తకుడు:- (అటునిటి చూచి) అదుగో! అదుగో! అటుచూడు. ఆ పంఢరిభజనపరుల గుంపులో చేరి తానున్నా పైత్యం లేచినవానివలె చిందులు త్రొక్కుతున్నాడు.

మొ. వ:- ఒరే, వీనికి పిచ్చెత్తిందిరా, ఈ రోగాన్ని మాన్పించేదెట్లామర్రి?

రెం. వ:- బావా! ఇది పిచ్చికాదు, భక్తి. ఇది భగవద్భక్తి. పంఢరినాథుని బజన.

మో. వః- దీనినే నేను పిచ్చి, ఉన్మాదము, అని అంటున్నాను.

రెం. వః- తప్పు, తప్పు. అపచారం అవుతుంది (ముక్కు చెంపలు వేసుకొని) భగవద్భక్తులను వెక్కిరించిన పాపము చుట్టుకుంటుందిబావా ! అట్లనవద్దు.

మో. వః- ఇది పిచ్చి, వెర్రి, అంటా, మళ్లీ అంటాను. ఈ తుకారాం వంశం లో ఈ పిచ్చి నేటిదికాదోయ్. తరతరాలనుండి పట్టుకొనివచ్చింది.

రెం. వః- అదెట్లా ! ఇతనికెవరో స్వాములవారు తిరుమంత్రం ఉపదేశించి నారని అనుకొనిఉంటిని. నీకు ఇతని వంశచరిత్ర బాగా తెలిసినట్లుంది అదేమిటో కాస్త తెలుపుదూ !

మో. వః- విను. వీనికిఏడుతరాల ముందుండినమూలపురుషుని పేరు, విశ్వం భరుడు. అతడు ముక్కుపట్టుకొని మూలలో కూర్చొని జపం చేసు కొంటూ ఉండేవాడు. అతని కాలమునుండే వీని వంశంలో పాండు రంగ విఠొబా కులదైవమైవెలసినాడు. ఈ తుకారాం తాత తల్లిపం డ్రులు మహాభజనపరులు. వీని పెద్దన్న షాహజీ అనేవాడు కొన్ని యేండ్లక్రిందట తటాలున ఆలుపిల్లలను వదలి సన్యాసులలో కలిసి పోయినాడు. ఇతని తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోయినారు. ఇత నికి ఇల్లువాకిలి సంసారం అంతా ఉన్నది. భార్యయైన జిజీబాయి పుణ్యమా అన్నట్టు సంసారమంతా ఆమె చేతిమీదుగా నడుస్తున్నది. ఆమెకు కూడా యీ ఉన్మాదం కనిపించుకొని ఉంటే ఇక చెప్పే దేముంది. ఇల్లంతా కోతులతో నిండినట్లుండేది. ఆమెకు పాండురంగని పూజలు సరిపడవు. ఆమె శైవులయింటి ఆడుపడుచు. ఆ జిజీబాయి కృషి మూలాన సంసారం ఒక విధంగా నడుస్తున్నది.

[మరల భజనపరుల సందడి వినబడును]

ఒరే! భజనపరులు ఈదిక్కే వస్తున్నారు. మనం దూరంగా తొలగి పోదాము. తుకారాం ఏమి చేయునో చూస్తూ ఉందాముపద.

[ప్రవేశము భజనపరులు—

తుకారాం వారితో సహా భజనచేయును. పంఢరిమార్గంగా భజన పరులు వెళ్లుదురు. తుకారాం ఒక్కడే ఆగిపోయి యీ విధంగా ఆత్మ గతంగా అనుకొంటాడు]

తల్లియుఁ దండ్రియచ్యుతుని ధామముసేరిరి, అన్న షాజి తా నల్లన సన్యసించె, మనమారటమొందె, సహాయహీనుడఁ,

జెల్లునెయింకఁ దుచ్ఛ సుఖజీవనకాంక్షలు నాకు; దేవ! యో
పుల్ల సరోజనేత్ర, ననుబ్రోవవె, వేఁడెద, విఠ్ఠలప్రభో!

సకల సంకటయుక్త సంసారమెటుల
నడపుదు, విపత్తు లేరీతిఁ గడపనేర్తు?
నీశ్వరా! జగద్రక్షకా! ఇంకనాకుఁ
దావకోజ్జ్వలపాద పద్మంబెదిక్కు!

[కనులుమూసి ధ్యాన సమాధిలో నిలిచియుండును. వర్తక స్నేహితులు సమీపింతురు.]

మో. వః— [తుకారాం భుజముపై చేయివేసి]—ఓయ్, తుకారాం, మనం ముగ్గురం వ్యాపారానికై కలిసివస్తిమి కదా. వెంటవచ్చినట్లేవచ్చి మధ్య చెప్పకుండా ఎటుపోయి యుంటివి?

తుకా—అయ్యా! ఆ భక్తాగ్రేసరులు, పాండురంగ విఠ్ఠలోపాసకులు, పంఢరి పురతీర్థయాత్రోన్ముఖులై భజన సేయుచు వెళ్లుచున్నది చూచినారు కదా. వారిభజన వినేవరకు నాకు ఎక్కడలేని ఆనందం కలిగినది. వారితో కలిసి భజనచేయుచూ నాలుగడుగులు నడిచివచ్చినాను. ఆ యాత్రికుల భక్తియేభక్తి. వారెంతటి ధన్యులోకదా. ఆహా. వారి పాండురంగ కీర్తనలు ఎంత పవిత్రమైనట్టివి. (ధ్యాననిమగ్నుడగును)

మో. వః- (రెండవవానితో) నేను చెప్పలేదోయ్, వీని పుట్టు పూర్వోత్తరాలంతా! వీనివెంట బెట్టుకొని పోవడం పిల్లిని చంకబెట్టుకొన్నట్లే! మనవర్తకం ఇంక సాగినట్లే! "తాజెడ్డకోతి వనమెల్ల చెడిచె" నన్నట్లు వీని సావాసంతో నీవు మొదలు చెడిపోతావు. తర్వాత నేను. (తుకారాంతో) ఓయ్! ఏమో చాలా ధ్యానంచేస్తున్నావు.

తుకాః- ఏమీలేదు. నేనున్నూ ఇట్లే పంఢరికి ఆ భజనపరులవెంట పోయి వస్తె బాగుంటుందని ఆలోచించుతున్నాను. మీరు నాకు సెలవియ్యండి పోయివస్తును.

మో. వః- (చేయిపట్టిలాగి) ఇదేమిపిచ్చి. దినదినం ముదురుతున్నది. మనం వచ్చినపనియేమి. ఇప్పుడు నీవు చేసేపనియేమి? తీర్థయాత్రలు ఎప్పుడుపట్టితే అప్పుడు చేస్తారా ఎవరైనా? వాటికి వేళాపాళా ఉండ వద్దా. మావెంట వచ్చేఅప్పుడు నీ భార్యకు జిజీబాయి క్షేమిమాట యిచ్చివచ్చినావు. వర్తకం తప్ప యింకేమియు చేయనని చెప్ప లేదా? మాట తప్పుతావా అయితే.

తుకా:- పంఢరికిపోయి తిరిగి వచ్చేఅప్పుడు వ్యాపారం బేరసారాలు చేసు కొంటూనే యింటికి వెళ్ళుతాను లెండి.

రెం. వ:- అట్లైతే మమ్ము వదిలిపెట్టి వెళ్ళిపోతానంటావా?

మొ. వ:- సెట్జీ, తుకారాం, నీకొక మంచిమాట చెప్పుతాను. కోపం చేసుకొన కుండా వింటావామరి.

తుకా:- (ముకుళితహస్తుడై) ఏమట్లా సెలవిస్తారు, మీరు నాకంటే పెద్దవారు. అనుభవజ్ఞులు, మంచిమాట చెప్పితే ఎవరైనా కోపగించుకొంటారా? అవశ్యంగా బోధచేయండి వింటాను.

మొ. వ. అట్లైతేవిను. మనం బేరసారాలుచేసి బ్రతికే వ్యాపారస్థులము. మనం దేవునివద్దకు పోయినా లాభంవచ్చే బేరమే సాగించవలసి ఉంటుంది. మన కులవిద్యను పరులకు అప్పజెప్పి, బాపలు, సన్యాసులు, బ్రహ్మచారులు, బైరాగులు చేసినట్లుగా రాత్రింబగళ్ళు విఠొబా విఠొబా అంటూ భజనచేస్తూ, ధ్యానంచేస్తూ కూర్చుని ఉంటే దాని వలన మనకేమైనా లాభముంటా? దానివలన ఆలుపిల్లల పోషణ అవుతుందా నీవే చెప్పుమరి?

తుకా:- మా అన్న పాజీ ఇట్లా అంటూఉండిరి—హరినామస్మరణ చేసి నట్లయితే పాపాలన్నీ ధ్వంసమగును. ఇష్టదైవాన్ని నమ్మినవానికి నష్ట మెన్నిటికిన్నీలేదు—ఈ మాటలు అబద్ధమంటారామీరు.

మొ. వ:- సేటుగారూ! మీరిట్టి మాటలను నమ్మి మోసపోయినారు. లేకుంటే మీకు మతిభ్రమణమైనా కలిగింది. ఏమయ్యా హరినామస్మరణము చేతనే చేసిన పాపాలంతా కొట్టుకొనిపోతే నరహత్యలు, దోపిడీలు చేసేవారికంతా వెంటనే స్వర్గలోకప్రాప్తి అయిందన్నమాట. ఓయీ నీవు మా వర్తకకులాన్ని చెరిచేదానికి పుట్టినట్లున్నది. మన దేవు డెవడో నీకు తెలుసునా? మనకు దుకాణాలే పంఢరిక్షేత్రాలు. మన త్రాసే మహాలక్ష్మి. మన తూకంరాళ్ళే మన పంఢరి మూర్తులు. వీటిని మరచిపొయ్యేవాడే నాస్తికుడు. మన పెద్దలంతా ద్రవ్యం ఎట్లు సంపాదించినారో మరచిపోయినావా? మనమెట్లు లాభంవచ్చే బేరం చేయవలెనో చెప్తావిను—

నరకులమ్మెడువేళ జంకుకొంకునులేక
కురుచసేర్లనుబట్టి కొలువవలయు,
దినవెచ్చమాదిగాఁ గొనవచ్చువారికి
దొంగతూకములుంచి తూచవలయు,

కాసుకాసునుజేర్చి గడియించునప్పుడు
మానంబునింటనే మఱవవలయు,
నెందుబోయిన నొకటిచ్చి పదినిలాగు
శ్రేష్ఠమౌబేరమే సేయవలయుఁ

గడుపువెల్తిగ నొకపూటగుడువవలయు,
వడ్డియని, నాగులని, మిండవడ్డియనియు,
జనులయాస్తుల తిన్నగాఁగొసగవలయు,
నిట్లుసేయని బేరియే హీనజనుఁడు.

పెద్దలునడిచిన బాటలోనే మనమున్నూపోవలెను

తుకా:- (నోరుతెరచికొనిచూస్తూ చెవులుమూసుకొని) హరిహరీ! ఎంతటిమాట సెలవిచ్చినారుమీరు. మీరు బోధించినట్లే చేసినట్లైతే బాటలుకాచి దోచుకొనే బందిపోటు దొంగలకున్నూ వ్యాపారులకున్నూ ఏమంత భేదమున్నది?

పశ్యతోహరుల్ చోరులు ప్రజలధనము
క్రూరులై లుంతనముచేయఁగోరుచుంద్రు
బంధుమిత్రులసహితము పాపమనక
వంచనముసేయుచుందురు వైశ్యకులులు.

దొంగలది ప్రత్యక్షహింస. మనది పరోక్షహింస. ఇంతేభేదము. వారు పరులను దోచుకొందురు. మనము చుట్టాలనుకూడా వదలకుండా మోసము చేయుచుందుము. ఇంతేనా?

రెం. వ:- అట్లైతే నీవెట్టివ్యాపారం చేయనెంచినావు.

తుకా:- పాండురంగని భజనము. పాపములేనిఆర్జనము.

మొ. వ:- ఓయీ, పిచ్చివాడా, కొంచెము పాటిప్రయత్నముచేతనే శ్రీ మహాలక్ష్మి మన యింట్లలో నివాసము చేయుటకు సిద్ధముగా ఉండగా అట్టి మహాభాగ్యమును వద్దని అంటారా ఎవరైన? సిరివస్తే మోకాలొడ్డుట అనేది యిట్టిదే.

ధనమెమూల మిహపరసాధనము కొఱకు,
సద్దిలేనట్టివాడె పో వ్యర్థజనుఁడు,
విత్తనాదంబు సతతంబు వినెడివాఁడు
గుడిని గంటలమ్రోయింపఁ గోరునెట్లు?

నీకు మరల బుద్ధిచెప్పుచున్నాను. విను, భక్తిపరులు తమ సంసారాలను నాశనముచేసి కుటుంబహింస చేసినవారౌతారు. నీవును ఇట్లే అచరించితివా నీ ఆలుబిల్లలకు దిక్కేవరు?

తుకా:- ఆ విషయములో నాకేమియు చింతలేదు.

స్వేచ్ఛతో సంచరించెడు విహగములను,
సమయసంతృప్తి నొందెడి సత్వచయము,
నేదయానిధి పోషించు సాదరమున,
నట్టి దైవంబు నాపాలనరిచియగునె?

పసుపక్ష్యాదులకేమైనా మరునాటి చింతయుండునా? అట్టివానిని రక్షించే సృష్టికర్త మనలను కూడా పోషించును.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"

అన్నాడు శ్రీ కృష్ణపరమాత్మ భగవద్గీతలో.

మొ.వ:- ఈ వెట్టి వేదాంతాలు నేనున్నూ గంటలకొలదిగా ఉపన్యసించుతానులే. నీతత్త్వమంతా సోమరితత్త్వము. తనను మాలిన ధర్మము లేదన్నారు పెద్దలు. భార్యను కట్టుకొన్నందుకు, పిల్లలను కన్నందుకు వారిని పోషించేభారము నీపైన ఉన్నది. ఆ గృహస్థ ధర్మాన్ని మొదట నేరవేర్చుము, నీవు ముసలివాడైన తర్వాత నీ పిల్లలకు సంసారం అప్పజెప్పి జైనారాయణ అని నీయిష్టం వచ్చిన తావుకు వెళ్ళు. అప్పుడెవ్వరున్నూ నీకై అంగలార్చరు. విన్నావా. ఈ వెర్రి వేదాంతము కట్టిపెట్టి ఊరక మావెంటరా.

తుకా:- అయ్యా, మీతోవాదించేశక్తి నాకులేదు పదండి. పదండి. ఇప్పటికి వ్యారపామే సాగింతము.

మొ. వ:- ఆఁ అట్లాపలుకవయ్యా, అదీ బుద్ధిమంతుని లక్షణము. తనకు తెలియకుంటే ఒకరు చెప్పినట్లైనా వినవలెను—ఇదిగో మనం దేహూ గ్రామాన్ని సమీపించుచున్నాము. మనం బండ్లపై ముందుగా సరుకులను పంపినాముకదా. వాటిని దుకాణంలోపెట్టి రేపటినుండే వ్యాపారం తిన్నగా చాకచక్యంగా సాగించి కులానికి పేరుతీసుకొని రావలెను. విన్నావా?

తుకా:- చిత్తం చిత్తం.

(నిష్క్రమింతురు)

# ప్రఘట్టకము ౨

[దేహూ గ్రామములో—తుకారాం—దుకాణము పెట్టి సరకులు అమ్ముచున్నాడు:—మిరపకాయలు, గోధుమలు చిల్లర దినుసులు. త్రాసు, తూకములు, సేర్లు ముందున్నవి. గానము చేయును.]

[గానమునకై చూడు అనుబంధము ౧]

(ఆత్మగతము) దేవా, పాండురంగా, ఈ వ్యర్థజన్మము నాకేల ఇచ్చినావు. ఈ వ్యాపారము చేయజాలను. బంధుమిత్రులందరు నన్నుదూషించుచున్నారు. పిల్లలు వేధించుచున్నారు. భార్య విసుగుకొంటున్నది. వ్యాపారములో నాకు చాకచక్యములేదు. ఈ మిరపకాయల దుకాణములో కూర్చుని ఈ త్రాసుతూకాలతో ఇంకెంత కాలముగడపవలెను. కొలతలో తూకములో ఏమైనా అన్యాయము జరిగితే అది అధర్మమవును. అన్ని పాపాలను హరించేవాడు పాండురంగడొక్కడే. అతని ధ్యానమే నాకు శరణ్యము. (ధ్యానించుచుండును.)

(వంచకుడొకడు ప్రవేశించును)

(స్వగతము) ఈ తుకారాంవద్ద జనులు తమ కిష్టమువచ్చినంతపైకమిచ్చి బుద్ధిపుట్టినంత సరకు తీసుకొని పోతారట. పైకమేమిన్నీ ఇయ్యకుండా సరకు తీసుకొని పోవుటే బుద్ధిమంతుని లక్షణము. (సమీపించి) తుకారాం మహారాజ్ రాం రాం!

తుకా—రాం రాం. దయచేయండి. ఏమిసెలవు.

వంచ—మహారాజ్, నాదొక చిన్న మనవి కలదు. చిత్తగించండి. నేను చాలా బీదవాన్ని. పాండురంగని సేవతప్ప మరేమిన్నీ యెరుగనివాన్ని. ప్రతిదినము తీర్థయాత్ర చేసేవారికి లేదనకుండా అతిథిసత్కారము చేస్తున్నాను. ఈ దినము నలుగురు అతిథులు వచ్చినారు. గోధుమలు పప్పు కాస్తోకూస్తో ఉన్నవి కాని మిరపకాయలు మాత్రములేవు. మరి చేతిలో పైకంలేదాయె. మిమ్ములను అడుగవలెనంటే సిగ్గౌతుంది. మీరు నన్నెరుగరు. ఎట్లానమ్మ గలుగుదురు. మీరు ఉద్దరగాఇస్తే తిరిగి కొంతకాలములో క్రయము చెల్లించుకొంటాను.

తుకా—అయ్యో పాపం. మీకెంత శ్రమకలిగింది. భక్తులకు సేవచేసే మీరు చాలాధన్యులు. మీపరోపకారబుద్ధికి చాలా ఆనందించినాను. మీవంటి మహాత్ముల దర్శనమైనందులకు నేను ధన్యుని అయినాను. మీకు కావలసినంత సరకుతీసుకొని పొండి. మీచేత పైకమున్ననాడే చెల్లించండి.

వంచ:— జైగోపాల్, నేను ధన్యున్ని. మీరు మహానుభావులని విన్నదంత ఇప్పుడు ప్రత్యక్షముగా చూడగలిగితినికదా. మీ ఉపకారము ఎన్నటికినీ మరవను.

తుకా:— అయ్యా, నేను మీవంటి భగవద్భక్తుల దాసానుదాసుడను. నన్నెందుకు స్తుతించుతారు.

వంచ:— తుకారాంజీ, నాకు ౪ సంచుల మిరపకాయ ఇయ్యండి.

తుకా:- ఓ, కావలసినంత తీసికోనిపో, ఇదంతా నీవే అనుకో, నాదికాదు.

వంచ:- ఎంతగొప్పబుద్ధి, ఎంతటి త్యాగము, ఇట్టి మహాత్ములు ప్రపంచములో అరుదుగా ఉంటారు. మహారాజ్, వెన్నవంటి మనసుగలవారు మీరు. మిమ్ముల మాటిమాటికి పీడించవలెనంటే బుద్ధిపుట్టదు. ఈ మిరుపకాయ ఇవే సంచులతో తీసుకొనిపోయి సంచులను తిరిగి తెచ్చియిత్తును. ఏమి సెలవు?

తుకా:- చిత్తం చిత్తం అట్లే కానియ్యండి.

వంచ:- రాం రాం సేట్‌జీ. మీ కోఠానుండి మీ సెలవు ప్రకారము పట్టించుకొని వెళ్లుతాను. మరల దర్శించుకొంటాను. సెలవు.

తుకా:-- నమస్కారము. (వంచకుడు నిష్క్రమించును.)

[వీధిలో ఒక బ్రాహ్మణుడు సంకెళ్ళతో యిద్దరి భటులతో--ప్రవేశము.]

బ్రాహ్మణుడు:-

అకటా! నాగతి యిట్టులుండె, తను వాయాసంబు నొందెంగదుఞ,
సకలాంగంబులు బాధచే సడలె, విశ్రాంతిఞ గనఞనేరఁ బా
తకిన్నై కష్టము లోర్వఁగావలసె, నీధాత్రి తలంబందు, భూ·
రికృపం బ్రోచెడి వారులేరె? యిఁక నేరిఞ వేఁడుదుఞ దైవమా.

శ్రీ పాండురంగా, విఠలప్రభో, నాపై నీకింకా అనుగ్రహము రాకపోయెనా?

తుకా:- ఎవరో పాపము, పాండురంగని దీనముగా ప్రార్థించుతున్నారు.

బ్రాహ్మ:- రంగా, రంగా! నాకు ఓక్కొవ్వరో చూపించు. ఈ ప్రత్యక్ష నరక బాధలతో నేను కష్టపడితే నీకంత ఆనందమా? ఈ విశాల ప్రపంచములో ఎందరు మహాపురుషులులేరు? వారికి దీర్ఘాయు విచ్చుటకు మారుగా నాకేల యిచ్చియున్నావు. నా కర్మ అనుభవించక తీరదు. ఇంకను దానికి పరిపాకదశ రాలేదు.

తుకా:- (లేచి సమీపించి) స్వామీ, మీరు ఉత్తములుగా కానవస్తున్నారు. చాలా దుఃఖములో ఉన్నారు. మీకీసంకెళ్ళు, ఈయవస్థ యెందుకు వచ్చెను.

బ్రాహ్మ:- నాయనా! ఇంతమాత్రమైనా విచారించే వారున్నారని ఊరడిల్లుతున్నాను. నేను ఋణముచేసి తీర్చజాలక ఈ రాజభటులవశమై యీ సంకెళ్ళతో ఊరూరు తిరిగి ధర్మాత్ములిచ్చిన దానాలతో అప్పు తీర్చుకొంటున్నాను. ఇంకా తీరినదికాదు.

తుకా:- తమకీ అవస్థ యేర్పడి యెంతకాలమైనది.

బ్రాహ్మ:- చాలకాలమైనదిలెండి, అదంతా చెప్పుకొని ఏమిలాభం?

తుకా:- మీ దేమివృత్తి.

బ్రాహ్మ:- బ్రాహ్మణజాతిలో పుట్టినాను. మొదటినుండీను యిప్పటిదనకూ యాచకమే నా వృత్తి.

తుకా:- తామియ్యవలసిన పైకమెంత.

బ్రా:- ఇంకా నూరు రూపాయీలు చెల్లించుకొనవలెను.

తుకా:- బ్రాహ్మణోత్తమా, సంతాపము మానుము. మీ ఋణమును ఇప్పుడే ఈ భటులకు చెల్లించుతాను. (దుకాణములోనికివెళ్ళి పైకముతెచ్చి) భటులారా, ఇదిగో ఇతని ఋణమును పూర్తిగా చెల్లించుతున్నాను. ఈయనను వదలివేయండి.

భటులు:- పైకమందుకొని—అయ్యా, బాపనయ్యా, నీ యిష్టంవచ్చిన చోటికి వెళ్ళు. నిన్ను వదలివేసినాము. స్వామి, మీపేరేమో కాని మీరు చాలా గొప్పవారు. పుణ్యాత్ములు. ఇక సెలవు.

[బ్రాహ్మణుడు తుకారాం కాళ్ళపైబడును]

తుకా:- ఇదేమిపని స్వామి, అపచారం అపచారం, నేను శూద్రున్ని, మీరు బ్రాహ్మణులు. ఇట్లా చేసిన నాకేపాపం తగులుతుంది.

బ్రాహ్మ:- అయ్యా, మీరేకులమువారైతేనేమి. నన్ను రక్షించిన దాతలు. ఎన్నో గ్రామాలు తిరిగినాను. కాని అయాచితముగా ఇట్లు సహాయము చేసిన వారిని చూడలేదు.

మున్ను శ్రీకృష్ణపరమాత్మగన్నయట్టి
యా సుధాముఁడు సంపదలందినటుల
నటుకులైన నొసఁగని యీ యధమజనుఁడు,
మీ కృపాతిశయంబున మేలువడసె.

అయ్యా, మీపేరేమి? మీ నివాసమెక్కడ? మీరు చేసిన ఉపకారాన్ని నేనెట్లా తీర్చుకోనగలుగుదునోకదా.

తుకా:- నన్ను తుకారాం అంటారు. నేను ఇదే దేహూగ్రామ నివాసిని. నా సంగతిని వదలండి. నన్నెందులకింతగా పొగడుచున్నారు. "పరోపకారార్థ మిదంశరీరం" అన్నారు పెద్దలు.

అనిశము మాతృదేశహిత మాత్మను గోరెడి వాఁడెభక్తుఁడౌఁ
దనతనువుఁ ధనంబును ముదంబున నర్పణసేయునట్టి యా
మనుజుఁడె త్యాగి, బ్రాహ్మణుల మాలల నొక్కవిధంబుసూచునా
జనుఁడెమనీషి, దుర్మదము శత్రుఁగఁజూచునతండె శూరుఁడౌ.

అట్టి లోకోత్తర పురుషులందరు మనకు పూజనీయులై యున్నారు.

బ్రాహ్మ:- మహానుభావా, మీరు నిరూపించిన గుణాలన్నియు మీలోనే కనబడుతున్నవి. అందుచేతనే మీరు అందరికిన్ని పూజ్యులైనారని అనుకొంటున్నాను.

తుకా:- స్వామీ, ఇక నాకు సెలవియ్యండి. దుకాణములో ఎవరున్నూలేరు. వెళ్లుతాను.

బ్రాహ్మ:- చిత్తం, మళ్లీ బ్రతికిఉంటే మీఋణము తీర్చుకొంటాను. దినము దీపముపెట్టేవేళ మిమ్ము ధ్యానంచేసుకొంటాను.

తుకా:- తప్పు తప్పు, పాండురంగని ధ్యానంచెయ్యండి. ఇదే నా చిన్న మనవి. సెలవు.

(బ్రాహ్మణుడు దీవించి నిష్క్రమించును. ఒక మోసగాడు ప్రవేశించును.)

మోస:- ప్రతి మనిషిని వాని ముఖమే పట్టించుతుంది. వీడు పట్టి అమాయకుడుగా కనబడుతున్నాడు. నా బేరానికి గురియైనవాడు వీడే. ఈ పూతపూసిన కడియాలను వీనికమ్మివేస్తాను. (సమీపించి) సేటుగారూ. నమస్కారం.

తుకా:- దయచేయుండి, ఏమికావలెనో సెలవియ్యండి.

మోస:- తమకీ బంగారు కడియాలు కావలెనా? చూడండి మంచి పదార్థాన్ని. బంగారు. దీన్ని కొనవైనాకొనండి. లేదా కుదువ ఉంచుకొని పైకమియ్యండి చాల సరసంగా అమ్ముతాను. చూడండి.

తుకా:- నాకు బంగారు అవసరంలేదు.

మోస:- ఏమండీ, మీరు వర్తకంచేసేవారు, ఇట్లంటే యెట్లు. ఇవేమైనా పూత పూసిన కడియాలా? బాగా పరీక్ష చేసుకోండి.

తుకా:- రామ రామ. అంతటిమాట యెందుకంటారు. మీరెందుకీ బంగారాన్ని అమ్ముతున్నారు.

మోస:- నేను ప్రక్క ఊరిలో ఉండే రైతును. సర్కారీ చౌథిపన్ను చెల్లింపవలసివచ్చింది. లేకపోతే నా భూములను-పెద్దలు సంపాదించి యిచ్చిపోయిన భూములను వదలించుతారు. అందుచేత యీ సొత్తులు అమ్మి పైకం చెల్లింతమనుకొన్నా.

తుకా:- ఎందుకమ్ముతారు. కుదువ బెట్టండి.

మోస:- అట్లే కానియ్యండి.

తుకా:- ఎంత ఇయ్యమంటారు.

మోస:- ౧౫౦ రూ॥ ఇయ్యండి.

తుకా:- ఇప్పుడే ౧౦౦ రూ॥ ఒకరికి ఇచ్చినాను. ఇక ౧౦౦ రూ॥ మాత్రమే మిలిగినవి. అవి కావలిసిన ఇత్తును.

మోస:- చిత్తం అంతైనా ఇయ్యండి. మళ్లీ పంటలమీదవచ్చి పైకం చెల్లించి నా సొత్తులు విడిపించుకొంటాను. ఏమంటారు. నాపేరు సఖారాం. వ్రాసుకోండి. తమ పేరేమి.

తుకా:- తుకారాం.

మోస:- సరే పైకమియ్యండి (పైకంతీసుకొని) ఇక సెలవియ్యండి. రాంరాం. (వెళ్లుతూ స్వగతం) తుకారామో గికారామో, "ఎవరికివారే యమునా తీరే" ఇక ఇక్కడినుండి శీఘ్రంగా పలాయనం చిత్తగించవలెను.

(నిష్క్రమించును.)

తుకారాం:- (ఆకాశము వంకచూచి) మట్టమధ్యాహ్నమైనది. ఇక ఇంటికి పోవలెను.

(ప్రవేశము ముగ్గురు తైర్థికులు)

వృద్ధుడు:- ఓరేయ్, మట్టమధ్యాహ్నమైనది. ఆకలి బాగా అవుచున్నది. మనకి సమయములో ఎవ్వరు భోజనము పెట్టుతారు. కాస్త ఎందైనా విశ్రమించి మళ్లీబాట పట్టుదాము.

౨వ వాడు:- అట్లే చేస్తాములే. ఈ గ్రామంపేరు దేహూ గ్రామమట.

౩వ వాడు:- అదిగో, అక్కడ అంగడిలో కూర్చున్న పెద్దమనిషి చాలా మంచివానివలె కనబడుతున్నాడు. అతన్ని ఆశ్రయింతాము రండి.

వృద్ధు:- ఆఁ అట్లే. (తుకారామును సమీపించి) జైగోపాల్, జైగోపాల్, సెట్జీ.

తుకా:- నమస్కారం, నమస్కారం. రండి. రండి. దయచేయండి. తమ వేషాలు చూస్తే తాము తీర్థస్థలాలు సేవించే వారుగా కనబడు తున్నారు.

వృద్ధు:- చిత్తం చిత్తం. తాము చాలా సూక్ష్మగ్రాహులు. మేము పంఢరి క్షేత్రానికి వెళ్లుచున్నాము.

తుకా:- ధన్యోస్మి, ధన్యోస్మి, (ముగ్గురిపాదాలను స్పృశించి) మీకుచేసేసేవ ఆ పాండురంగనికి చెందుతుంది. మీ పవిత్రపాదధూళి నాఫాలస్థలము సోకినదంటే సూర్యభగవానుని కిరణప్రసారముచే కరుగునట్టి మంచు గుట్టలవలె నాపాతకరాశియంతయు దూరమైపోవును.

వృద్ధు:- ఎంతవినయము, ఎంత భక్తి. నాయనా నీవు మహాభక్తుడవు. నీ సందర్శనముచేత మేమున్నూ పవిత్రులమైనాము.

తుకా:- ప్రొద్దు చాలా అయినది. ఈ బీ ద వా ని ఆ తి థ్య ము ను తాము తప్పకుండా స్వీకరించవలె.

వృద్ధు:- ఆడబోయినతీర్థ మెదురైనట్లున్నది. నాయనా, మేము కాస్త విశ్ర మించగోరియుంటిమి, ఇట్టి అకాలములో గృహస్థులను ఎందుకు తొందరపెట్టవలెననుకొనియుంటిమి.

తుకా:- ఈ దాసుని గృహము తమదిగా భావించండి. సంకోచింపవద్దండి.

వృద్ధు:- నారాయణ, నారాయణ, కానియ్యండి.

(నిష్క్రమింతురు)

# ప్రఘట్టకము 3

తుకారాం భార్య జిజీబాయి ఆమె ఇద్దరు కుమారులు

౧ బాలుడు:- అమ్మా, నా కింతరొట్టె ఇయ్యమ్మా. ఆకలౌతుంది.

౨ బాలు:- నాకూ ఇయ్యి, తే ఒకటియ్యి.

జిజీ:- ఒరేయ్ పొద్దున్నే తిన్నారుకదా. ఏమంతతొందర. కాస్త ఆగండి. మీ నాన్న వస్తాడు. వచ్చినట్లు ఆయనవద్ద తిందురుకాని.

౧ బాలు:- ఊహూం- నాకిప్పుడేకావాలె.

౨ బాలు:- నాకూ కావాలె. నాన్న ఎప్పుడొస్తాడో ఏమో. అంతవరకు నేనుండను. నాకు ఆకలంటే ఆకలి అవుతున్నది.

౧ బాలు:- మాకెప్పుడూ కడుపునిండా తిండిపెట్టవు. ఎప్పుడడిగినా లేదనే అంటావు.

జిజీ:- నన్నేమి చేయమంటారురా. మీనాన్న సంపాదించేది అంతపాటే. అంతా పాడుచేస్తాడు. తనకు లేకున్నా మీ కడుపుకొట్టి దానాలు ధర్మాలు చేస్తుంటాడు. ఆయనకు పాండురంగడుంటే కడుపునిండుతుందట. ఆయన ఇంతలో వస్తాడు కదా ఆడుగండి.

౧ బాలు:- నాన్న ఎప్పుడూ భజన చేసుకొంటూ ఉంటాడమ్మా. ఎప్పుడూ ఏమేమో రాసుకొంటూ ఉంటాడు. మొన్న శివాజీ మహారాజంట మూడుసంచుల గోధుమలంపితే అన్నదానం చేసిపెట్టినాడు.

౨ బాలు:- మొన్న ఎవరో ఆయన చాలా మంచివాడమ్మా నాన్నకు చెరుకుల మోపు ఇస్తే అవన్నీ ఊర్లో పిల్లలకు పంచిపెట్టి వచ్చినాడు. నాకు ఒక్కటే ఒక్కటి ఇచ్చినాడు.

జిజీ:- ఓరేయ్, మీకు ఈడుకు మించిన తెలివి తేటలున్నవి. కాని ఏం ఫలం. దేవునికి మనపైన దయరాదు. మీనాన్నకు సంసారం కాబట్టదు. నేనొక్కదాన్ని ఎంత కష్టపడితే ఏమిలాభం.

౧ బాలు:- నాన్న వచ్చేవరకు మేము పస్తుండవలసిందేనా మరి.

జిజీః— కొంచెము ఓపిక పట్టండిరా. ఇప్పుడే మీనాన్నవస్తాడులే. (తెరవంక చూచి) అదిగో రానేవచ్చెను. వెంట ముగ్గురిని తోడుచేసుకొని వస్తు న్నాడు. మీ పాలిరొట్టెలకు వారు వేంచేసినట్లుందిరా? వెంటవచ్చిన వారిని బయట వదలి మీనాన్న వస్తున్నాడు చూడు. మీరులోపలికి పొండి.

(తుకారాం ప్రవేశించును)

తుకా- - జిజీ! యాత్రికులు వచ్చినారు. వేళకాని వేళవచ్చినారు. వారింత వరకు భోజనం చేయలేదు. వారికి ముందుగా భోజనం పెట్టు.

జిజీః— ఎక్కడినుండి తెచ్చిపెట్టేది. మనకే లేకుంటే బాటపట్టుకొని పొయ్యే వారికంతా అన్నం పెట్టవలెనంటే ఇదేమి ధర్మ సత్రమనుకొన్నారా యేమి?

తుకాః— జిజీ! వారు పుణ్యాత్ములు. పంఢరి యాత్రచేస్తున్నారు. వారినేమి అనవద్దు. అపచారమౌతుంచి

జిజీః- తమకంత అభిమానం ఉంటే తామున్నూ వారి వెంటనే వేం చేయండి.

తుకాః- నేనున్నూ ఇంతలో వెళ్లుతానులే. ఇప్పుడు మాత్రము నామాట తీసి వేయవద్దు.

జిజీః- ముగ్గురికి మాత్రమే సరిపడే భోజనం సిద్ధముగా ఉంది. మరివచ్చిన వారికిపెట్టితే మీకు మీపిల్లలకు ఏమిపెట్టుదును?

తుకాః- మనసంగతి అవతలచూచుకొందాములే. వారిని పిలుచుకొని వస్తాను, కోపం చేసుకోవద్దు. అతిథులు సాక్షాద్భగవత్స్వరూపులు. వారికి భక్తితో వడ్డించు, ఏమి.

జిజీః- మీ యిష్టంవచ్చినట్లు చేయండి.

(తుకారాం తైర్థికులను పిలుచుకొని వచ్చును.)

తుకాః- ఇటు ఇటు, దయచేయండి. లోపలికి దయచేయండి. అంతా సిద్ధంగాఉన్నది. భోజనమునకు కూర్చొనుడు.

తైర్థిః- యజమానితోగూడా భోజనంచేస్తాము. తామున్నూ దయచేయండి.

తుకాః- నేనింతవరకే భోజనం చేసినాను. లెండి. తమకిప్పటికే చాలా పొద్దైంది.

(త్రైర్థికులు లోపలికి వెళ్లుదురు.)

జిజీ! పెద్దమనుషులు వచ్చినారు చూతు. విచారించుకొనుము.

(స్వగతము) నేడు చాలా సుదినము కాని నాజిజీకి సంసారతాపత్రయం పై ఉన్న వ్యామోహము జగన్నాటక సూత్రధారియగు ఆ పాండు రంగనిపై మనస్సు కుదుట బడుటలేదు. "బుద్ధిఃకర్మానుసారిణీ" ఎవ్వరి కర్మవారు అనుభవించవలసినదే.

(ఒక భిక్షుకుడు ప్రవేశించుసు)

[ఈ క్రింది గేయమును ఏకతారపై పాడును.]

తొలిజన్మంబున చేసినకర్మము తొలగిపోవునా ఓరన్నా
పుట్టినప్రాణులు గిట్టక గట్టిగ పుడమినిల్చెనా ఓరన్నా
తొమ్మిదిక్రంతల తోలుతిత్తిపై మోహమేలరా ఓరన్నా
ఎన్నేండ్లుండిన ఇహమునతంబని ఎంచబోకురా ఓరన్నా
భార్యాపుత్రులు బంధులువెంబడి వచ్చుటకల్లర ఓరన్నా
కలిమిని రూపము వయసునునమ్మక గర్వింపకురా ఓరన్నా
చేసిన పాపముపుణ్యము వెంటనె చేకొనిపోవుదు మోరన్నా
షట్శాస్త్రంబులు నాల్గువేదములు చదివిననేమిర ఓరన్నా
సకలపురాణము లామూలాగ్రము చదివిననేమిర ఓరన్నా
పరోపకారంబొక్కటె గతియౌ వైకుంఠంబున కోరన్నా
పండరినాథుని గొల్చినవారికె స్వర్గమబ్బురా ఓరన్నా
పరమభక్తితో పంఢరినాథుని పాయకకొలువుర ఓరన్నా!
తొలిజన్మంబున చేసిన కర్మము తొలగిపోవునా ఓరన్నా!

జై, పాండురంగ విఠల మహాప్రభో జై! మహానుభావా, భగవద్దాసుని కేమైనా దానము సేయండి.

తుకా:- (స్వగతం) ఈ బిచ్చగానికి దొరకిన యీ సంపదలో శతాంశమైనా నాకు దొరికినట్లైతే నిశ్చలానంద సామ్రాజ్యమునేలి యుందునుగదా. విఠొబాదేవుని స్తుతించు కవిత్వమే కవిత్వము. తక్కినదంతా కపిత్వము.

బిచ్చ:- ఇంతరొట్టెయైనా పెట్టించండి.

తుకా:- (వినిపించుకొనకుండా — ఆత్మగతమున) ఈ భాగవతోత్తముని గానములోని భావమాధుర్యము పంచభక్ష్య పరమాన్నముకన్న మించినది. అంతేకాదు. ఇది అమృతము.

బిచ్చ:- స్వామీ! బిచ్చము పెట్టకుంటే పోయిరమ్మనైనా చెప్పరేమి? కష్టమైతే ఇంకో యింటివద్ద ఒక ముష్టి దొరుకుతుందిలెండి.

తుకా:- ఓయ్, కోపము చేసుకొనవద్దు. ఏమో పరధ్యానములో ఉంటిని. నీకేమి కావలెనో చెప్పు.

బిచ్చ:- బిచ్చగాండ్ర కోపము ఎవరిమీద స్వామీ! ఒక పాతవస్త్రము పారవేస్తే తలచుకొంటూ వెళ్ళిపోతాను.

తుకా:- ఈ దరిద్రునికి వస్త్రాలెక్కడివి. (పైకిచూచి) జీజీ చీర ఇక్కడున్నది. దీన్ని యిచ్చివేస్తా. (కొయ్యనుండి చీరను లాగి యిచ్చివేయును)

బిచ్చ:- ఇదే పదివేలు స్వామీ. ఇక సెలవు.
—తొలిజన్మంబునచేసిన కర్మము తొలగిపోవునా ఓరన్నా—
(అని పాడుచూ నిష్క్రమించును)

తైర్థికులు:- తుకారాంజీ, "అన్నదాతా సుఖీభవ" మీరు ఉత్తమ గృహస్థులు. మీకా వైకుంఠనాథుడు సర్వసౌఖ్యాలిచ్చుగాత.

తుకా:- ఈ బీదవాని యింట ఎండినరొట్టెలేకదా. మీకు తుష్టిగా సపర్య చేయలేనందులకు విచారించుచున్నాను.

తైర్థి:- అయ్యో! ఎంతమాట! పాపమా కన్నతల్లి మమ్ము తుష్టిగా ఆరగింపజేసింది. యాత్రికులకు ఇంతబాగా భోజనము పెట్టేవారు ఈ కాలంలో కానరారు స్వామీ.

తుకా:- అనుగ్రహం.

వృద్ధు:- ఇకసెలవా?

తుకా:- చిత్తము. మిమ్ముకొంతదూరము సాగనంపివత్తునురండి. భక్తుల వెంట కొంతదూరమైనా నడిచినట్లైన సుకృతము కలుగుతుందని అంటారు పెద్దలు. (నిష్క్రమింతురు)

[ ప్రవేశము జిజీబాయి ]

జిజీ:- (స్వగతము)—అంబా! భవానీ! నాకెందుకు ఇట్టి అవస్థ తెచ్చిపెట్టినావు. గొప్పవారి యింటిలోనే పుట్టితిని. మంచివంశములోనికే వచ్చితిని. కాని మావారి కెవ్వరుపదేశించినారో యేమో ఒకటేపిచ్చి. ఎప్పుడూ పరోపకారమంటూ ద్రవ్యమంతా నష్టముచేస్తూ ఉంటారు. ఇంట్లో మాకే కూటికిలేకుంటే ఎక్కడినుండో ముగ్గురిని బాటపట్టుకొని పోయ్యేవారిని పట్టుకొనివచ్చి వారికి భోజనము పెట్టించిరి.

ఈ దినము పిల్లలూ, నేనూ, ఆయనా, అందరమున్నూ పస్తుండవల సినవేకదా. నాసొమ్ములమ్మి 300 రూపాయిలు కూడబెట్టి వ్యాపారం చేయుమంటే ప్రతిదినం ఏదోపరోపకారం చేసినానని ఉత్త చేతులతోనే ఇంటికివస్తాడు. ఇట్టి మేధకునితో ఇట్టి అమాయకునితో సంసారం ఎట్లా సాగుతుంది?

( ప్రవేశం శిశువులు )

౧ వాడు:- అమ్మా, రొట్టెలన్నీ వారికే పెట్టితివే. ఎవరమ్మా వారు.

౨ వాడు:- వారు మన చుట్టాలా ఏమమ్మా.

౧ వాడు:- నాకాకలియే ఆకలి అవుతుందమ్మా.

జిజీ:- మీ నాన్నగారు కొత్త చుట్టాలను సాగనంపి తిరిగి వస్తున్నారు. వారినే అడుగండి.

( ప్రవేశం తుకారాం )

బాలురు:- బాపూజీ, బాపూజీ, మాకాకలి అవుతుంది. ఇప్పుడు వచ్చిపోయిన వారే అంతా తినిపోయినారు. మేమేమి తినవలెను.

తుకా:- నాయనలారా, ఒక్కపూట ప్రాణము పట్టుకొని ఉండండి. నేనెక్కడ నైనా సంపాదించుకొనివచ్చి మీకు భోజనానికి లోపములేకుండా చేతునులే.

౨ వాడు:- ఇప్పటికే మాకు కడుపు మాడుచున్నది నాన్నా.

తుకా:- అట్లైతే ఇదిగో ఒక ఉపాయముచెప్తావిను. శ్రీమత్పుండరీకవరదుని మనసార ఒక్కమారు భజించండి. పిల్లలప్రార్థనను దేవుడు వెంటనే వింటాడు. మీ ఆకలంతా మాయమైపోతుంది.

జిజీ:- మంచి భోజనమే తినిపించినారు పిల్లలకు. మీ పాండురంగడు ఏమైనా లడ్డా, బాసుందియా, ఖోవానా. వీరికడుపులు నిండేటందుకు?

తుకా:- అంత చులకనగా మాట్లాడుతావేమి? భగవంతుడు నమ్మిన వారి కంటె చాలా ఎక్కువ. అతడు నిజంగా అమృత ప్రదాత.

జిజీ:- చాలులెండి. ఇకచాలించండి. ఈ ఉన్మాదాలంతాను.

తుకా:- నీకు సరిపడకుంటే పోనీలే. జిజీ.! నేడు చాలా సుదినము నాకు వింటివా.

జిజీః- ఆఁ వింటున్నానుకదా. వ్యాపారంలో మంచిలాభం వచ్చిందా. ఏదీ. ఎంతవచ్చింది చూపండి చూస్తాము.

తుకాః- కాదు. అదికాదు. నేను నాశక్తికొలది ముగ్గురికి సహాయము చేసినాను.

జిజీః- ఆ సంగతి ఇప్పుడు చూచనేచూస్తినికదా. అదేముచ్చట ఇంకెన్ని మారులు చెప్తారు.

తుకాః- ఇప్పుడు వచ్చినవారు కాదు. వారు కాక మరి ముగ్గురికి సహాయము చేసినాను.

జిజీః- మరి ముగ్గురికా? చాలా సంతోషించినాను. అడుదాని సొత్తులను కూడా ఇంద్రాణీనదిలో పారవేసి వచ్చినానని చల్లగా చావువార్తవలె నాకు వినుపిస్తున్నావా?

తుకాః- ఏమే, నీకేప్పుడున్నూ ముక్కుపైననే కోపము. నేను చెప్పేది వినసైనా వినవు. అదంతావింటే నీవున్నూ సంతోషించవా?

జిజీః- నాకు నిత్యమూ సంతోషానికేమికొదువ?

తుకాః- ఊరకవిను. మన అంగడిలోని మిరపకాయ నాలుగు సంచులు ఒక భక్తునికి అతిథి సత్కారానికిచ్చినాను. ఇప్పుడేమో ఉద్దరనే కాని మళ్లీ పైకం వస్తుందిలే.

జిజీః- మంచిపని చేసినావు.

తుకాః- అదే మంతమంచిపని. ఇంకావిను. పాపం. ఒక పేద బ్రాహ్మణుడు ఋణము చెల్లించలేక రాజభటులవశమై సంకెళ్లతో చాలా ఏండ్లనుండి ఘోరకష్టాలను భరించుచూ వచ్చినాడు. అతన్ని విడిపించినాను.

జిజీః- నేను ఋణముతెచ్చి యిచ్చిన పైకముతో, నా సొమ్ముల పైకముతో దిక్కులేని బాపనయ్యఋణము తీర్చినావు. బాగుంది. చాలా బాగుంది. ముందు నాకు సంకెళ్లు తగిలినప్పుడు నన్నెవ్వరు విడిపింతురో యేమో?

తుకాః- పాపమా బ్రాహ్మణుడు వీధులలో దుఃఖించుచుంటే ఎంతటి కఠినునికైనా గుండెకరిగే అట్లుండింది.

జిజీః- ఇంతటి కరుణానముద్రులు కనుకనే సొంతబిడ్డలు దొక్కలెండి అన్నమో రామచంద్రా అని ఏడ్చుచుంటే శ్రీ పాండురంగా పుండరీక

వరదా, పండరినాథా, విఠ్ఠలప్రభో అని వారికి తిరుమంత్రం ఊది గాలిపీల్చి బ్రదుకండి అని బోధించుచున్నావు. థూ, థూ, ఈ బ్రతుకు బ్రతికేదానికంటే ఏనూయో చూచుకొని కండ్లు మూసు కుంటే బాగుంటుంది.

తుకా:- జిజీ, కాంతా, ఎందుకంత కోపమునీకు. నేనేమైనా అధర్మకార్యాలు అన్యాయాలు, దుర్మార్గములుచేస్తే నీవు ఆగ్రహించుట న్యాయము. ధర్మకార్యాలు చేసినప్పుడు కూడా నీకు సహింపులేదా?

జిజీ:- నీ ధర్మము దయ్యాలపాలుకానీ.

తుకా:- హరి హరీ, ఎంతమాట పలికితివి.

జిజీ:- ఒరే, నాయనలారా, ఇక మీరు దిక్కులేనివారైనారు. మనమంతా అనాథులమైనాము.

తుకా:- శ్రీ పాండురంగడు మాయింటివేల్పు. ఆయనయే మనకందరికిన్ని దిక్కు.

జిజీ:- మంచిరంగడు. వాడు నిన్ను దయ్యమువలె పట్టినాడు. వాని మూలాన నీవూ మేమూ నాశనం అవుతున్నాము.

తుకా:- ఇదిగో జిజీ, ఇంతవరకు నీవు నన్ను తూలనాడినావు. అందుకు నాకేమిన్ని ఆయాసము కలుగలేదు. సర్వమంగళాకారుడును, ఆర్త త్రాణ పరాయణుడును అయిన పాండురంగస్వామిని నీవిప్పుడు దూషించుతున్నావు. ఇది మాత్రము నేను సహింపజాలను.

జిజీ:- సహింపలేకపోతే చెవులుమూసుకొని నోరు మూసుకొని వుంచేయవచ్చు.

తుకా:- నీకూ నాకూ పొత్తు కుదురదు. నేను నీకు భారమైపోయినాను. ఇప్పటినుండి నీ బాట నీది. నా బాట నాది. ఇదిగో ఇప్పుడే వెళ్లిపోతు న్నాను. విఠొబా నీకు శాంతిసౌఖ్యములు ప్రసాదించుగాక. నాయన లారా, మీరు సౌఖ్యంగా వృద్ధికివచ్చి కీర్తిపొందండి. మీ అందరితోను సెలవు తీసుకొంటున్నాను. (నిష్క్రమించును)

౧ వాడు:- అమ్మా, బాపూజీ ఎక్కడికి పోతాడే.

౨ వాడు:- దేవళానికిపోయి భజనచేసుకొనివస్తాడేమో?

౧ వాడు:- కాదురా దుకాణానికి పోయివస్తాడనుకుంటా.

జిజీ:- ఎక్కడికిపోతాడు? అక్కడా యిక్కడా తిరిగి మరల చీకటయ్యే వరకు ఇంటికిపడవస్తాడులే.

౨ వాడు:- బాపూజీకి ఎన్నడూలేని కోపంవచ్చినట్లుందమ్మా ఈనాడు.

౧ వాడు:- నాన్నకుకూడా బాగా ఆకలైవుంటుంది. ఆయనకేమి యెక్కడైనా తినివస్తాడు,

జిజీ:- కుర్రలారా, మీరెంతటి దిక్కులేనివారైపోయినారురా. మీరెందైనా ధనికులయిండ్లలో పుట్టియుంటరావా. ఈపేదరాలికడుపులో పుట్టుటకు ఏమికర్మము మీ పూర్వజన్మాన చేసివుంటిరో యేమో? మీకు కట్టుకొనుటకు కూడా మంచిబట్టలు లేకపోయె. నాకున్నా ఈ కట్టుచీర ఆ కొయ్యపైన..........అయ్యో! ఇదేమిచిత్రమమ్మా, కొయ్యమీద చీరలేదు. అదికూడామాయమైంది. ఎక్కడపోయింది........... దాన్నికూడా మీనాన్న ఏ బిచ్చగానికో దానంచేసినాడు. ఇంకెట్లు?...... అంబా, భవానీ, నాస్వామికి పట్టినఉన్మాదాన్ని ఎప్పుడు పోగొట్టుతావే ఏమో తల్లీ! నిన్నే నమ్ముకొన్నాను..........కుర్రలారా, రండి. ఎక్కడైనా కూలినాలిచేసి యిన్ని గింజలు తెచ్చి మీకు భోజనం సిద్ధము చేస్తానుకాని.

౧ వాడు:- అట్లేకానీలే అమ్మా, నిన్నేమిన్నీ తొందరపెట్టములే.



# ప్రఘట్టకము ౪

మాస్వాజీబాబా— పుష్టిమైన మనిషి, ఎర్రని చెవుల జుట్టుటోపీ, మెడనిండా రుద్రాక్షలు, భుజాలకు నొసటికి విభూతి. కనుబొమ్మలమధ్య కుంకుమం, కావిపెల్లా, పింజదోవతి, బుర్రమీసాలు, ౫౦ ఏండ్ల వయస్సు. శాక్తేయుడు. ఎదుట కాళీవిగ్రహం, ధూపదీప నైవేద్యోపకరణాలు, గంట, పాత్రలు, కర్పూరం, మున్నగునవి.

శంభాజీ— శిష్యుడు. యువకుడు.

స్థలము—మఠము

మాస్వాజీ:- జై భగవతీ, శాంభవి, కాలభైరవి. ఒరే శిష్యా, ఎక్కడున్నావురా శంభాజీ, కాళీపూజకు ధూపదీప నైవేద్యాలు, పుష్పతాంబూలాలు అన్నీ సిద్ధమైనవేమిరా?

శంబాజీ:- స్వామీ, మాస్వాజీబాబా మహరాజ్‌జీ. గురుమహారాజుల వారి ఆజ్ఞానుసారం అంతా అప్పుడే సిద్ధంచేసి పెట్టినాను.

మాస్వాజీ:- (ఒకచేత హారతి, ఒకచేత గంటతో) హే భగవతి, కాలభైరవీ, త్రిజగన్మాతా, నీభక్తుని అనుగ్రహించు.

† ఓం, దేవి, త్వత్ప్రకృతం చిత్తం పాపాక్రాంత మభూన్మమ
తన్నిస్సరతు చిత్తాన్మేపాపం హుంఫట్ చితే నమః
బ్రహ్మ విష్ణుస్తుమేశః ప్రణమతిచ సదాత్వత్పదాం భోజయుగ్మం
భాగ్యాభావాన్న చాహం భవజనని, భవత్పాదయుగ్మం భజామి
నిత్యంలోభ ప్రలోభైః కృతవివశమతిః కాముకస్త్వాం ప్రయాచే
కుంతవ్యోమేఽపరాధః ప్రకటితవదనే కామరూపేకరాళే!

ఓం క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హ్రీం హుం హుం దక్షిణే
కాళికే క్రీం క్రీం క్రీం హ్రీం హ్రీం హుం హుం స్వాహా॥

---

† ఈ రంగములోని శ్లోకాలను తంత్రగ్రంథాలనుండి ఉదాహరిస్తున్నాను.

ఒరే, శంభాజీ, నైవేద్యం ఎక్కడరా?
శంభాజీ:- ఏ నైవేద్యం స్వామీ?
మా:- బలి నైవేద్యంరా, మూర్ఖా
శం:- అంటే ఏం స్వామీ?
మా:- ఛాగమాంసమురా. ఇన్నాళ్లు సేవచేసినా వట్టివద్దమ్మవేరా నీవు.
శం:- అవా, ఇవే ఈ పాత్రలో మూసిపెట్టినాను.
మా:- ఇటుతే (అందుకొని) దేవీ, నైవేద్యం స్వీకరించు.

"ఛాగ, త్వం, బలిరూపేణ మహాబాగ్యాదుపస్థితః
ప్రణమామి సదాభక్త్యా, రూపిణం బలిరూపిణం."
ఓం భూర్భువస్సువః; ఓం పశుపాశాయవిద్మహే,
విప్రకర్ణాయధీమహి, తన్నః ఛాగః ప్రచోదయాత్"
ఓం తీర్థం పట్టుకొనిరా.

శం:- భట్టీలో నుండి యిప్పుడిప్పుడే సిద్ధమై వచ్చింది. ఇదిగో స్వామి.
మా:- (అందుకొని) దేవీ, మద్యముపై నీకుండినంత ప్రీతి మరేదేవతకున్నూ లేదు.

మద్యపానరతా, మత్తా, మద్యపాన విహారిణీ,
మదిరా మదిరారక్తా, మదిరాపానహర్షిణీ,
మదిరాపాన సంతుష్టా, మదిరాపాన మోహినీ,
మదిరాపాన ముగ్ధాచ, మాధ్వీపా, మదిరాప్రదా.
ఓం నమో భగవత్యై, సర్వకామప్రదాయిని.
(తానుకొంత త్రాగి) శంభాజీ, ఇదిగో దేవీతీర్థము. (శిష్యుడు కొంత త్రాగును)

మా:- ఒహ్హైరా, ఏమి యీ దివ్య తీర్థ మహిమ. అందుచేతనే మా శాక్తేయమతము సర్వోత్కృష్టము. మాదీక్ష పొందినవారు మరల మరేదేవతనూ ఉపాసించరు.

శం:- స్వామీ! నాకొక చిన్న సందేహం కలదు. మద్యపానము ధర్మవిరుద్ధమని అంటారు. అందులో బ్రాహ్మణులైన మీరు దీనిని సేవింపవచ్చునా?

మా:- ఇదా నీసందేహం. నీవు నాబోధవింటావా లేక మందిబోధలు వింటావా? అది మొదలు చెప్పు.

శాం:- చిత్తము. తమ బోధే నాకు కావాలె.

మా:- అట్లైతేవిను. ఇది దేవీ ప్రసాదము. శాక్తేయులకు తంత్రగ్రంథాలే వేదాలు. వాటిలో మద్యమాంసాలు లేనిది శక్తిపూజ చేయగూడదని శాసించినారు. అవిలేని పూజలు సిద్ధింపవు. పూర్వకాలంలో మహర్షు లంతా మద్యపానరతులు. తర్వాతికాలంవారికి శక్తిసామర్థ్యాలు నశించినవి. వారు నిస్తేజులై, సత్త్వహీనులై వీటిని త్యజించినారు. ఒక్కొక్క కాలములో ఒక్కొక్క మహామహుండు మధుసేవాసక్తుడై ఎంతటి మహాకార్యాలుచేసినాడో చూడు.

ఒకనాఁడు దైత్యుల యొజ్జయౌశుక్రుండు
నిర్జించెఁబోరున నిర్జరులను,
ఒకనాఁడు సర్వలోకోత్తరుఁడైమించెఁ
గములజతుల్యుఁడగస్త్యమౌని,
ఒకనాఁడు యాదవనికరంబు మెచ్చంగ
బలరాముఁడరిత మోభానుఁడయ్యె,
ఒకనాఁడు రుద్రుండు సకలలోకాతీత
శక్తుఁడై శిక్షించె సకలరిపుల,

వీరి సామర్థ్యమెల్ల మాధ్వీరసంబు
పాన మొనరించుకతన సంప్రాప్తమయ్యె;
ఆదిశక్తికిఁ దోఁబుట్టువైన దీని
దూషణము సేయువారలే తుచ్ఛజనులు.

ఒరే, నీకు మధుపానమహత్తు బాగా తెలియదు. వేదశాస్త్ర పురాణాలను బాగా పరిశీలించిచూస్తే దేవతలు, ఋషులు, సర్వవర్ణాల వారు సదా ఈ మదిరా దేవీ సేవాసక్తులై యుండినారని తెలుస్తుంది.

శం:- గురుదేవా, మీరుసర్వజ్ఞులు. తెలియకఅడుగుతున్నాను. పూర్వం యాదవులు కల్లుత్రాగి పరస్పరం కలహించుకొని నాశనమైనారని పురాణాలలో వ్రాసినారుకదా. మరి ధర్మశాస్త్రాలలో మద్యపానాన్ని నిషేధించి నారని అంటారుకదా.

మా:- నీవు నాకంటే నాలుగాకులు ఎక్కువ చదివినట్లుందే. ఇవన్నీ నీకిప్పుడెందుకు, నీకు గురుబోధయే పరమవేదము.

శం:- చిత్తం చిత్తం, క్షమించండి. ఇదివరలో ఈ శిష్యునికింత మాత్రం కూడా తాము బోధించి యుండలేదు.

మా:- గురుసేవ అంతా ఒకనాడే లభిస్తుందా యేమి. క్రమంగా అనుగ్రహించబడుతుంది. ఇంకా కొంత తీర్థము పుచ్చుకో, ఇదో—

(ఇద్దరును త్రాగుదురు)

మా:- ఓరేయ్, శంభాజీ సుందరియింకా రాలేదేమిరా?

శం:- సానిగారికప్పుడే చెప్పవచ్చినాను స్వామి "నీవు పద. వెనుకనే వస్తాను పో" అని అన్నదండి.

మా:- సుందరిలేకుంటే ఈ మతానికి అందమే లేదురా

శం:- సుందరి వేశ్యకదండి.

మా:- మన శాక్తేయ మతంలో వేశ్యలకు తప్పులేదు. మనవేదిక నాదా ఒక్కొక్కప్పుడు వేశ్యాపూజించబడుతుంది. ఆ తత్త్వమంతా నీకు మరొకమారు ఉపన్యసించుతానులే.

(సుందరి ప్రవేశము)

సుందరి:- బాబాగారు సాక్షాచ్ఛంకరభగవత్స్వరూపులుగా విభ్రాజమానులై ఉన్నారు. గురుశిష్యులు ఏకాంతగోష్ఠిలో మునిగితేలుతున్నారు.

మా:- ఓహో, సుందరీ, వచ్చినావా, ఎంతసేపాయె, నీకొరకై ఎదురుచూడబట్టి. రా, కూర్చో.

సుం:- చిత్తం. గురువులవారికి దాసురాలు సాష్టాంగదండాలు మనవిచేసుకొంటున్నది.

మా:- దీర్ఘసుమంగళీభవ. సర్వకామసిద్ధిరస్తు. ఇటురా. ఇదో తీర్థం తీసుకో.

సుం:- మద్యము మాకు ముఖ్యతీర్థం. పైగా సారాయి, నల్లమందు, గంజాయి, మా ముఖ్యకామతంత్రపరికరాలు.

మా:- చూచినావురా శిష్యా, ఎంత చక్కగా మాట్లాడుతుందో.

సుం:- స్వామీ, ఇవన్నీ వేశ్యల వశీకరణ తంత్రాలు.

తాంబూల మందించుతఱి నల్లమందిడి
చొక్కించి కవగూడునొక్క ధూర్తు,
గంజాయి ద్రాపి మైకంబుచే సోలించి
పిలపించు మరియొక్క విటుని వేగ,
సారాయి కొంతయాస్వాదించుమని వేఁడి

మత్తిల్లి నన్ను ని పొత్తుసేరు
మంచికల్లిది ద్రావుమంచు లాలనసేసి
వేఱొక్క లంపటు వేగఁ బిలుచు,

వేశ్యనేరని ధౌర్త్యముల్ విశ్వమందు
వెఱుతావుల దొఱకునే వెదకిచూడ;
వారకాంతల వలలందుఁ బడినవారిఁ
దిరిగి విడిపింప శక్యమే సురలకైన

ఎందరో పండితులు, కవులు, ధనికులు, భూస్వాములు, మా యిండ్లకు రహస్యముగా వచ్చి పోవుచుందురు. అది మాపాండితీ ప్రకర్షకు ప్రబల నిదర్శనము.

మా:- నీ టక్కులంతా నావంటి వానివద్ద పనికి రావులే. ఒరే శంభాజీ, నీవు బయట మహద్వారమువద్ద కూర్చో. మా సెలవు లేనిది యెవ్వరికినీ యీనాడు మాదర్శనం కాదని గట్టిగా చెప్పి పంపివేయుచుండుము.

శం:- ఏ కొరకై శ్రీమంతులవారు కానీ మహారాజులు కానీ వచ్చినను లోనికి రానియ్యవద్దంటారా?

మా:- శివాజీ మహారాజుగారు వచ్చినాసరే సెలవులేదు.

శం:- మరి సుందరికొరకెవరైనావస్తే ఏంసెలవు?

మా:- వారికన్నీ సెలవులేదు. ఇక నీ అధిక ప్రసంగాలు చాలించి నడు. బయటికి నడువు.

సుం:- చూచినారా, మీ శిష్యుని పాండిత్య విశేషాలు!

మా:- ఏమిరా యింకా నిలుచున్నావేమి?

శం:- సుందరియేమో సెలవిస్తుంటే విందామని ఆగితిని.

సుం:- ఏమీలేదు. దయచేయండి శిష్యోత్తమా!

శం:- చిత్రం చిత్రం (నిష్క్రమించును.)

సుం:- మాస్వామీ, మహారాజ్, ఏమి ఆజ్ఞ. సెలవియ్యండి. ఇట్టి సమయంలో ఈ చరణదాసి తమకు జ్ఞాపకం వచ్చింది.

మా:- సుందరి. ఆహా ఎంతటి ముద్దైనపేరు. నీ అందానికి పూర్తిగా తగిన పేరు. నా శిష్యులందరిలో నీవే నాకు ముఖ్యురాలవు సుమా.

సుం:- చాలా అనుగ్రహం. అదినాపుణ్య విశేషము.

మా:- నీవు నిజంగా ధన్యురాలవు.

సుం:- అయితే ఈ తుచ్ఛవేశ్యాజన్మం నాకేల కలిగింది.

మా:- తప్పు. తప్పు. అట్లనుకోవద్దు వేశ్య నిత్యకల్యాణి, సదాసౌభాగ్యవతి. పైగా సాక్షాత్కాళీస్వరూపిణి. మాతంత్ర శాస్త్రములో ఏమన్నారో తెలుసునా?

సుం:- ఏమన్నారు?

మా:- వేశ్యాదేహసమాయోగాత్
కాళీదేహ సమన్వయం
ఏవంవదతిసాకాళీ
తస్మాద్వేశ్యాపరామతా."

అని అన్నారు. మనశాక్తేయులలో పురుషులంతా సాక్షాచ్ఛంకరభగవత్స్వరూపులు. స్త్రీలంతా కాళీస్వరూపిణులు. నీకు సర్వకామ్యార్థ సిద్ధి అయ్యే మంత్రము ఉపదేశిస్తాను. దాన్ని పరమభక్తితో జపించితే సర్వసిద్ధి కలుగుతుంది.

సుం:- మావద్ద మంత్రాలేకాక తంత్రాలుకూడా చాలా ఉన్నవిలెండి.

వేశ్యనెత్తికెక్కించిన వెఱ్ఱిమాన్ప
మందుమాకులు దొఱకునే మహినివెదక
సాని పట్టించినట్టి పిశాచమార్ప
మంత్రవేత్తల కెందైన మహిమకలదె?

మా:- భక్తిలేకుంటే మంత్రము సిద్ధించదు.

సుం:- చిత్తం. మీపైన నాకు భక్తిఉంది. ప్రేమఉంది. మీరంటే అదెందులకో పంచప్రాణాలు అప్పజెప్పుతాను.

మా:- ప్రేయసీ, ధన్యుడనైనాను. ఎంతటి తియ్యనిమాటలు పలికితివి? నీమాటలు అక్షరలక్ష విలువచేయుచున్నవి. సుందరీ, నీకు నాయందు నిజముగా భక్తి ప్రేమలుంటే గురుదక్షిణ సమర్పించుకొనవలసి యుండునుసుమా.

సుం:- గురువుగారి ఆజ్ఞలను పరిపాలించేదానికి సర్వసిద్ధముగా ఉన్నాను.

మా:- ఆ సంగతి నాకునూ బాగా తెలియును. అయినా మరల మరల అడుగవలసి వచ్చినది.

సుం:- అదేమిటో సెలవియ్యండి.

మా:- నీవు గట్టిగా పూనుకొంటే తప్పకుండా సిద్ధించుతుంది.

సుం:- ఏట్లు?

మా:- నీ సౌందర్యానికి, నీ సంభాషణమాధుర్యానికి ముగ్ధుడై నీదాసాను దాసుడై, నీ చరణసేవకుడై కుక్కవలె నీవెంట వాడు తిరుగగలడు?

సుం:- ఎవడువాడు? ఇంతకూ మీరు ఆజ్ఞాపించేవేమిటో చెప్పకనేపోతిరి.

మా:- గట్టిగా చేస్తానని చేతిలో చేయివేయుము.

సుం:- అట్లే. (చేయివేయును)

మా:- (గట్టిగా పట్టుకొని) నిత్యనూతనత ఉన్నది నీ స్పర్శలో. ఉద్దీపన శక్తియున్నది. సుందరీ, మన గ్రామములో తుకారాం అనే దొంగ భక్తుడున్నాడు తెలుసునా?

సుం:- ఆయన పేరు విన్నాను.

మా:- వాడు మన సంప్రదాయానికి ప్రతిస్పర్ధి. వానిపై నీ సమ్మోహనాస్త్రము ప్రయోగించి వానికి మన శాంభవీదీక్షను ఇప్పించవలెను. ఇదే నేను కోరిన చిన్నకోరిక.

సుం:- అతడు జితేంద్రియుడట. పరమభక్తుడట. అక్కడ నా యాటలు సాగవు.

మా:- ఛూత్, ఎంతటి పనికిమాలినమాట పలికితివి. నీవు సామాన్యురాలవా? చక్కనిచుక్కవు, చక్కెరబొమ్మవు, భువనమోహినివి. లావణ్యవతివి. తిరస్కృతోర్వశీరంభా తిలోత్తమవు. మరి ఆ తుకారాము డేమి శుకుడా? భీష్మాచార్యుడా? ఇనుపకచ్చడం కట్టుకొన్నాడా? వాన్ని వశీకరించుట నీకొకకష్టకార్యమా?

సుం:- ఏమో, నాశక్తి కొలది ప్రయత్నించి చూస్తాను. నాకు అతడు లోబడెనా అతన్ని తొందరగా మీ చరణ సన్నిధిలోతెచ్చి వదలివేస్తాను.

మా:- సెబాస్, అదీ సరియైనమాట. ఇదో మరికొంత తీర్థము స్వీకరించు. (ఉభయులు త్రాగుదురు) ఈ మధ్య నీ మధురగానము వినలేదు. ఏదీ కాస్త వినిపించు.

సుం:- చిత్తము, (గానము చేయును)

మా:- ఖేష్, భళీ, నీగాన మాధుర్యము బ్రహ్మానందదాయకము.

"సుందరి, నీపురూపు. గడుసుందనమున్. భవదీయరాగని
ష్యందితమాధురీమహిమ, చారువిలాసము హావమెంతొయా
నందము గూర్చునెవ్వరికి? సన్మసుమంబులలోని మార్దవం
బందముతోడఁగూర్చి, చతురాననుఁ డిట్లు నినున్ సృజించెఁబో!
(వీపుపైతట్టి) ఇదిగో, మరికొంతతీర్థము తీసుకో. మోహనాంగీ,

పూర్తిగా తాగవద్దు. కాస్త నాకువదలిపెట్టు.

సుం:- నా యుచ్ఛిష్టము మీకెట్లు పనికివచ్చు.?

మా:- అదేనీపొరపాటు. శాక్తేయదీక్షితులకు సంపూర్ణంగా అభేదత్వమున్నది.
ఇటుతే. (పానశేషం త్రాగును.)

సుం:- స్వామీ, ఇక సెలవా?

మా:- ఏం. అప్పుడే? ఇంత తొందరేమిటి? మరికొంచెము సేపుండరాదా?

సుం:- మీ శిష్యురాలు ఇంతకాలం సేవించినా ఏంలాభం ?

మా:- నీకేంకావాలె? అడుగు! నీవడిగితే లేదు అని నాలుకకు వస్తుందా ?

సుం:- ఏమి చెప్పుదునంటి :—

అర్ధంబుసూచిన యాలుమానములకే
కనకాంగి గడియించె ధనముమిగుల,
వయసువచ్చిన రెండు వత్సరంబులలోనె
చంద్ర తాగట్టించె సౌధములను,
మనయూరి దొరవారు మన్నించినదిగో లె
మీనాక్షివాడలో మిన్నయయ్యె,
చెట్టి మోహించి చేపట్టినప్పటినుండి
చంద్రభాగయు గణాచారియయ్యెఁ,

దోడి సుందరులందరు తుష్టినుండ
సతము మీపాద సేవనాసక్తి కలిగి
సంచరించుచునుండు నీసాన్నికైన
సర్వ దారిద్ర్య దైన్యముల్ సంభవించె

మా:- నేనుండగా నీకెందుకంత విచారము. ఇప్పుడు నీకియ్య దగినన్ని
రూపాయిలు చేతిలోలేవు. అయినా నీకు అంతకంటె యెక్కువగానే
ఇస్తానుండు. (అటుయిటు చూచి) ఈ దేవిపై భక్తులు పెట్టిన సొమ్ము

లన్నీ నీవే అనుకో, ఇప్పటికి ఈ హారం తీసుకో (తీసి సుందరి మెడలో వేయును.) సంతోషమైందా? ఎంతైనా వేశ్యవు. నీవేమైరా నన్నొక్క నినే నమ్ముకొని యున్నావు కనుకనా?

సుం:- అదేమట్లు సెలవిస్తారు. అందరి సానులవలె అనుకొంటిరా నన్ను. మీరు చేపట్టిన తర్వాత మరొకరి మొగము చూచినానేమో మా వాడలో ఎవ్వరినైనా విచారించుకోండి.

మాస్వా:- ధన్యోస్మి, దన్యోస్మి. ఇకపోవచ్చును. కాని మళ్లీ యెప్పుడువస్తావు.

సుం:- ఎప్పుడు తలచుకొంటే అప్పుడే ప్రత్యక్షం అవుతాను.

(ప్రవేశము శంభాజీ)

(స్వగతము):- మా గురువులు రహస్య గోష్ఠిలో మునిగి తేలుతున్నారు. ఇప్పుడు పలుకరించితే ఏమంటారో యేమో. పలుకరించకపోతే ఆ వచ్చిన పెద్దమనిషి వెళ్లిపోతానంటాడు.

మాస్వా:- ఏమిరా, ఏమిటీ కండ్లు మిటకరించుకొంటూ అదేమిటో గొణుగుకొంటూ నిలబడినావు. లోపలికి రావద్దంటికదా. ఎందుకు వస్తివి.

శం:- బాబాజీ, ఎవ్వరో ఒక పెద్దమనిషి మీకొరకు చాలాసేపటినుండి కాచుకొని ఉన్నాడు.

మా:- ఎవ్వరైనానరే, ఈదినం సెలవులేదని చెప్పిపంపవద్దూ.

శం:- అతనిపేరు పండితరావట.

మా:- పండితరావో, ఖండితరావో, మేమిరాడు దర్శనం ఇయ్యమనిచెప్పు.

శం:- అయన పూనానుండి వచ్చినాడు గురుజీ.

మా:- అరే! పూనానుండి అయితేనేమి, ఢిల్లీనుండి అయితేనేమి. నీకెందుకీ అధిక ప్రసంగమంతా.

శం:- నేను తమకు ముఖ్య శిష్యున్ని అయితిని. ఇదంతా విచారించుకోకుంటే తామేమనుకొంటారు.

మా:- ఛీ, కుర్రవెధవా, ఆవలికిపొమ్ము.

శం:- ఆఁ మరిచిపోయినా, ఆ పండితరావు ఏ మహారాజువద్దనుండో వచ్చినానన్నాడు.

మా:- మహారాజుకానీ, మొగల్‌సుల్తానుకానీ, అతనికంత భక్తి ఉంటే రేపు రమ్మని చెప్పుపో,

శం:- ఆఁ, జ్ఞాపకంవచ్చింది. శ్రీఛత్రపతి శివాజీ మహారాజుగారు అతన్ని తమవద్దకంపినారట!

మా:- ఏమి, ఏమీ, శ్రీ ఛత్రపతిగారా, శివాజీ మహారాజుగారా, నావద్దకంపినారా? నిజమా?

శం:- నిజంస్వామీ. మూడువేల రూపాయాల్ను తెచ్చినాడు. మూడు సంచులను కట్టుకొని పట్టించుకొని వచ్చినాడు.

మా:- రూపాయాలా? మూడువేలా? ౩౦౦౦ రూపాయాలు! ఒరే, మూర్ఖా

శం:- స్వామీ, మీ శిష్యుణ్ని

మా:- ఒరే, తెలివి తక్కువకుంకా

శం:- చిత్తం, మీ బోధలు తప్పితే నేనింకేమిన్నీ యెరుగను.

మా:- ఒరే, శుంఠా, గాడిదా, దున్నపోతా!

శం:- అచ్చంగా మీ అంశే నాలో ఉన్నట్లుంది స్వామీ.

మా:- ఒరే, అమాట మొదటలే యెందుకు చెప్పకపోయినావ్. ఛత్రపతి మహారాజుగారి దూత- ఆయన పేరు పండితరావు అన్నావుగా అతడు వాకిలివద్ద ఎంతసేపైంది కాచుకొని.

శం:- ఒక గంటకాలమయి వుండవచ్చు.

మా:- ఎంతపని చేసినావురా. అప్పుడే తెలుపవద్దా నాకు.

శం:- శివాజీ మహారాజు వచ్చినా లోపలికి వదలవద్దని తాము అజ్ఞయిచ్చితిరి కదా.

మా:- తెలివితో పనిచెయ్యవలె.

శం:- ఇప్పుడేమి మునిగిపోయింది లెండి. తాము సుందరితో రహస్యగోష్ఠిలో ఉన్నారనిన్నీ ఈనాడు దర్శనం దొరకదనిన్నీ చెప్పిపంపుతాను లెండి.

మా:- బుద్ధిలేదు. పో, వెంటనె ప్రవేశపెట్టు అతన్ని

శం:- చిత్తము (వెళ్లును)

మా:- సుందరీ, నీవు దిడ్డివాకిలి గుండా వెళ్ళిపో, తొందరగాపో, అ తుకారాముని సాధించేది మరచిపోవద్దు సుమా.

సుం:- స్వాములవారి అదృష్టం పండింది. ఇంకేముంది. శివాజీ మహారాజులే శ్రీవారి శిష్యులైనారన్నమాట. ఐశ్వర్యం వచ్చినదని ఈ సేవకు రాలిని మరిచిపొయ్యేరునుమా, ఇక సెలవు. (వెళ్ళును)

[ ప్రవేశము, పండితరావు, ఒక సేవకుడు మూటలతో, శంభాజీ. ]

పండితరావు:- మహాత్మా, నమస్కారములు. తమ దివ్యసన్నిధానమునకు శ్రీ శ్రీ శ్రీ ఛత్రపతి శివాజీ మహారాజులుంగారు కానుకలంపినారు.

మా:- మహారాజులుంగారికి అఖండదిగ్విజయం కలుగుగాక. ఏదో కుగ్రామంలో ఒకమూలలో కూర్చొని భగవద్ధ్యానం చేసుకునేవాన్ని. నావంటి వానితో మహారాజులకేమి ప్రయోజనంలెండి.

పండిత:- మీవంటి మహాత్ములుండబట్టే దినదినం క్షీణించుతూ ఉన్న హిందూమతం పునరుద్ధరింపబడుతూ ఉన్నది.

మా:- అంతా పరమేశ్వరుని అనుగ్రహము. తమరాకవలన మా మఠానికి ఒకవిధమైన కళ కలిగింది. శంభాజీ, వీరికి దేవీప్రసాదమియ్యి. అదిగో ఆ తట్టలో ఉందిచూడు.........అదికాదురా అదికాదు. ఆ తట్టలో పండ్లున్నవిచూడు అదితే.

శం:- చిత్తం. (అందిచ్చును)

మా:- వీరికి పాదతీర్థమియ్యి. పాదతీర్థం వింటివా?

(శంభాజీ సారాయిగిన్నెనందుకొనును)

నీకెన్నిమారులు బోధించినా తెలివిరాదు. ఏది ఎప్పుడు చేయవలెనో, ఎవరెవద్ద ఎట్లాచరించుకొనవలెనో నీకింకా తెలియకపోయెను. అవక్కడపెట్టు. పాదతీర్థమాస్థాళిలోఉంది చూడు.

(శంభాజీ అందించును. పండితరావు స్వీకరించును)

పండి:- మహానుభావా! తమకీర్తి పూనానగరమంతటను వ్యాపించిఉన్నది.

మా:- మేము కీర్తికాములముకాము. అయినను దానివ్యాప్తికి మేమేమిచేయగలము? ప్రతిదినం నానాప్రాంతాలనుండి భక్తులు మామఠానికి వస్తూ ఉంటారు.

పండి:- అదంతా తమ పాండురంగ విఠ్ఠలస్వామి భక్తివిశేషం.

మా:- మేము పాండురంగభక్తులముకాము. మేము కాళీ మహాదేవి ఉపాసకులము.

పండి:- అవెట్లు స్వామి! పూనా నగరంలో తుకారాం స్వామి సర్వకాల సర్వావస్థలయందు విఠోబా దేవుని భజించు పరమ భక్తాగ్రేసర చక్రవర్తులని ప్రతీతి ఉండగా, తామిట్లు సెలవిచ్చుచున్నారే?

మా:- (శిష్యునితో జనాంతికముగా) ఒరే, శంభాజీ, ఇతడు తుకారాంకొరకు వచ్చినట్లుంది. మనకొరకుకాదురా. మాసంగతి వీరికి నచ్చేరీతిగాచెప్పు

శం:- పండితరావుజీ, వీరు మా గురువుగారు, మాస్వామీ బాబాగారు. గొప్ప ఉపాసకులు. సాక్షాచ్ఛంకరావతారులు, చుట్టూ ఇరువైఆమడ వీరి మంత్రశక్తి చాలా ప్రసిద్ధి వహించింది. పిల్లలుకానివారు వీరినాశ్రయించితే వారికి సంతానప్రాప్తి కలుగుతుంది. రోగులకు వీరి పాదతీర్థమిస్తే వెంటనే నయమవుతుంది. వీరి యింటిలో ఏడుతరాలనుండి కాళీ మహాదేవి ప్రసన్నముగా ఉంది. వీరు బ్రాహ్మణోత్తములు. ఆ తుకారామో శూద్రుడు, శూద్రులు ఆరాధనయోగ్యులు గారు.

పండిత:- సరే. ఇంక చాలించు నీ ఉపన్యాసం. నేను పొరపాటుబడెరాను. తుకారామ స్వామికే ఈ ౩౦౦౦ రూపాయాల కానుకను సమర్పించి రమ్మని మహారాజుల వారి ఆజ్ఞ అయింది.

మా:- ఒక సామాన్య శూద్రునిపై మహారాజుగారికి భక్తి కుదురుట చాలా చిత్రముగా ఉంది.

శం:- పండితరావు మహారాజ్, ఈ కానుకను శూద్ర తుకారామునికిస్తే ఏం ఫలం. మాస్వాముల వారికే సమర్పించండి.

పండి:- నోరుమూయి, మరొకమారు ఇట్లే ప్రేలితే నీకు శిక్ష అవుతుంది జాగ్రత్త. (సేవకునితో) పదరా, వెదకుకొంటూ తుకారాంస్వామి యింటికి వెళ్లుదాము. (నిష్క్రమించును)

మా:- ఏమిరా, శంభాజీ, పని అంతా చెడిందిరా. శివాజీ మహారాజుగారి ఆశ్రయము మనకు లభించిందని ఎంతో ఆశ పుట్టెనుగదరా! తుకారాంగాని అదృష్టం పండిందిరా! ఇంకెట్లు?

శం:- పోనీలెండి స్వామీ, మీకేమి భక్తులు, శిష్యకోటి తక్కువ గనుకనా. ఇంకా కొన్నిదినాలకైనా మీ సంగతి అంతా పూనావరకు తెలియక పోతుందా?

మా:- ఆ తుకారాంగాడు నాకుపోటీగా ఏర్పడినాడురా, వానిమూలాన నా కీర్తి ప్రతిష్ఠలకు భంగము కలుగుతూ ఉంది. వానికి తగినశాస్తి చేయకుండా ఉంటానా? కానీ, చూస్తాము. (నిష్క్రమింతురు.)

# ప్రఘట్టకము ౫

భాస్వానాథ పర్వత ప్రదేశము. గట్లలో పొలాలున్నవి. అక్కడక్కడ గట్లు, అరణ్యము,

తుకారాం ఏకాకిగా తిరుగుచుండును.

(స్వగతము)

పంజరమునుండి వెడలిన పక్షివోలె
బంధములఁద్రుంచు సింగంబుభాతి యగుచు,
వాగురాలఁజిక్కని మృగపాళినొప్పి
నిర్మలానంద సౌఖ్యాప్తినెగడఁగంటి.

ఈ భాస్వానాథ పర్వతారణ్య సీమ ఎంతయో రమణీయముగా ఉన్నది. ఇది నిశ్చల సమాధికి పరమాశ్రయము. భగవంతుని దివ్యమహిమకు తార్కాణము. స్వేచ్ఛాజీవనమునకు అలంబనము. ప్రకృతి సౌందర్యమునకు నిదర్శనము. సంసార తాపత్రయ విముక్తుడనైన నాకు ఈతావు బ్రహ్మానందదాయకమైయున్నది. లౌకికవ్యవహారాలలో తగుల్కొని స్నేహితులచేతనేకాక నా జిజీ చేతను తిరస్కృతడనై కష్టించుటకన్న ఇచ్చట స్వేచ్ఛతో భగవన్నామ సంకీర్తనము చేసుకొనుచు కాలము గడుపుట చాలా సుఖమునిచ్చును.

మలల సెలయేటి నిర్మలజలముగ్రోలి
సాంద్రపాదపశీతలచ్ఛాయఁజేరి
కందమూలాది భుక్తినానందమొంది
పాండురంగనిఁగొలుచుటే పరమసుఖము.

దేవా, రంగనాథా, నీ కరుణా కటాక్షములను నాపై ఒక్కమారు ప్రసరింపజేయరాదా. నీ చరణకమలములుతప్ప నేనన్యమెరుగను. నీదివ్యనామ సంకీర్తనమే నాకు ప్రాణాధారము.

[భజనసేయుచు ధ్యానముద్రలో ఒక గుండుపై కూర్చొనియుండును.]

[కూర్మిదాసు—ప్రవేశించును. అతడు వ్యవసాయకుడు పెద్దరుమాల, పప్పటి, పెద్దమీసాలు, చేతిలో ములుకోలకట్టె, కాళ్ళకు చెప్పులు, మోకాళ్ల పైక ధోవతి, ౫౦ ఏండ్లవయస్సుండును. భాస్వానాథ పర్వత ప్రాంతము లోని జొన్నచేలు అతనివే.]

(స్వగతము)

ఎవ్వడోయేమో ఇతడు. ఈ అయివారు దినాలనుండి ఆదేపనిగా యీ పొలాలవద్ద తిరుగుతూ ఉన్నాడు. ఇప్పుడేమంత మోసంలేదుకాని ఇంక వారందినాలలో జొన్నచేలంతా పిసికిళ్ళకు వస్తవి. అప్పుడేమన్నా దొంగతనం చేస్తాడేమో. మనిషి వాలకంచూస్తే దొంగవలె కని పించడు. సాధువువలె ఉన్నాడు. మంచివాడే అయితే చేనికి కావలిపెట్టే బాగుంటుంది. పల్కరించి చూస్తాను. (సమీపించి) ఎవరయ్యా నీవు. నీకు సంసారం గింసారం ఏమన్నా ఉందాలేదా? మా చేలనంతా అదేపనిగా చెడదొక్కుతున్నావు.

తుకా:- నీ పొలాలలో తిరుగలేదయ్యా, ఊరకనే ఏందుకనుమానపడుతావు. కృష్ణా రామా అనుకొంటూ కాలంగడుపుకొంటున్నాను. ఎవ్వరికిన్నీ అపకారంచేయను.

కూర్మి:- (స్వ) అట్లైతే నాకు పనికివచ్చేవాడే. (ప్రకాశంగా) నీ పేరేమి ఏ ఊరునీది.

తుకా:- నన్ను తుకారాం అని పిలుస్తారు. నాది దేహూ గ్రామం.

కూర్మి:- తుకారాం. నీకోమంచిమాట చెప్తా వింటావా?

తుకా:- మంచిమాటచెప్పేవారు కానరాలేదనేకదా ఈ అడవులుపట్టి తిరుగు తున్నాను.

కూర్మి:- విను. ఈ చేనూ, అదో ఆ చేనూ, ఈ రెండున్నూ నావే. జొన్నగింజ పట్టింది. ఇక్కడ మంచేవేసి ఉన్నాను. దానిమీద కూర్చొని పిట్టల కాస్తే నీకూ పొద్దుగడుస్తుంది. నాకున్నూ పనివెళ్లుతుంది. ఊరక యీ పని చేయవద్దులే. నీకు మంచి కూలియిస్తా,

తుకా:- నాకు కూలివద్దు ఏమివద్దూ. నీకేమైన నావలన లాభముంటే తప్ప కుండా నీసేవ చేయుటకు సిద్ధముగా ఉన్నాను.

కూర్మి:- నీకు అన్నం ఎవ్వరు పెట్తారు.

తుకా:- ఎవ్వరునూ పెట్టరు. అడవిపండ్లు తిని బ్రదుకుతున్నాను.

కూర్మి:- నీకు దినం రెండుపూటలా రొట్టెలుతెచ్చి పెట్టుతాను. ఈ చేలకు కావలి కాస్తావా? పైగా పంటపండిన తర్వాత దానిలో పదో భాగం నీకు పంచియిస్తా. ఏమంటావు.

తుకా:- "జనసేవాహీ ఈశ్వరసేవా
యూవిన దుసరా మార్గపతావా"
"మానవసేవయె మాధవసేవ
దానినిమించిన ధర్మములేదు."

అని పెద్దలు చెప్పినారు. దేవుడు షుష్క పూజలను మెచ్చడు. తాను సృష్టించిన జీవకోటిని ఎవడెవడెట్టి త్యాగముతో సేవచేసినాడో దానినిమాత్రమే భగవంతుడు పరికించును. స్వార్థముతోకూడీన ప్రార్థనలు ఎన్నటికని ఫలించవు.

కూర్మి:- ఈ తత్త్వాలంతా నాకు అర్థముకావు. అయితే అడుగుతున్నాను నీదేమివృత్తి.

తుకా:- విశ్వసేవావ్రతమే నావృత్తి.

కూర్మి:- అంటే?

తుకా:- ప్రపంచసేవ.

కూర్మి:- అట్లంటేయేమి? అందరికిన్నీ ఊరకనే సేవచేస్తావా?

తుకా:- అవును.

కూర్మి:- ఊరకచేస్తే నీకు జీవనంగడిచేదెట్లా?

తుకా:- అదంతా విఠలస్వామిదే భారం.

కూర్మి:- ఓయ్, తుకారాం, నీకేమో తత్త్వాలు బాగాతెలిసినట్లుంది, నేనొక మాట చెప్తావిను. నీవు వట్టి అమాయకుడవుగా కనిపిస్తున్నావు. ఊరకనే సేవచేస్తానంటే అందరున్నూ చేయించుకొంటారు. తనను మాలినధర్మముంటుందా? నీసేవకు తగినట్టుగా ప్రతిఫలం తీసుకొని పనిచేయి.

తుకా:- సరేలెండి. పుఱ్ఱెకొకబుద్ధి, జిహ్వాకొకరుచి.

కూర్మి:- అట్లైతే నీ యిష్టం. మరి యీచేను నేనుచెప్పినట్లు కాస్తావా?

తుకా:- మంచిది.

కూర్మి:- ఇదో ఈ మంచెపైకూర్చో, ఈ కట్టెతీసుకో, పెడిసెలు, పిట్టలు చేని మీద వాలకుండా కూతలుపెట్టుతూ, కట్టె విసరుతూ కాయవలె. రాత్రి పూట దొంగలు చేలలోబడి కంకులు కోసుకొనిపోకుండా జాగ్రత్తగా ఈ రెండుచేలలో తిరుగుతూ ఉండు. రెండుపూటలా నీకు భోజనం పంపించుతా. పంట బాగా చేతికివస్తే నీకు చెప్పినట్లుగా భాగంకూడా ఇస్తా. విన్నావా. ఇంక నేను పోదునా?

తుకా:- మంచిది వెళ్లండి. నాచేతనైనంతవరకు నీ చేలను కాపాడుతాను.

(తుకారాం కట్టెబట్టి మంచెపై కూర్చొనును. కూర్మిదాసు వెళ్లిపోవును.)

తుకా:- (స్వగతము) భూదేవివంటి దేవత మరెందునూ కానరాదు. ఆ తల్లి వద్ద ఒకటి దాచితే మనకు వేలకొలదిగా ఇచ్చును. దేవుని మహిమలు నావంటిమూఢులకు బోధకానేరవు. ఆతనిలీలలను అర్థము చేసుకొనలేక జనులు పలుమారు పరమాత్ముని నిందించుతుందురు. వానినొక్కమారు శుద్ధమానసముతో ధ్యానించితే చాలు. సంకటాలన్నీ తొలగిపోతవి.

ఎవ్వాని భక్తుఁడై యొసఁగుచుండెడి వాఁడు
చక్రవర్తులనైన నరకుగొనఁడు,
ఎవ్వాని స్తుతియింప నెఱిఁగిన మనుజుండు
కోటీశ్వరులనైనఁ గోరఁజనఁడు
ఎవ్వాని సృష్టికి హితవర్తి యగువాఁడు
తుచ్ఛకామంబుల నిచ్ఛగొనఁడు
ఎవ్వాని కారుణ్య మింతేనిఁబడసిన
దుఃఖంబులన్నియుఁ దొలఁగిపోవు
ఎవ్వని నిరంతర ధ్యానమిహపరముల
సాధనోపాయమై యుండు సజ్జనులకు
నట్టి శ్రీ పాండురంగ మహాప్రభావు
భక్తియుక్తిమైఁబ్రార్థింతు శక్తికొలఁది.

ఈ జొన్నచేలు గాలికి ఉయ్యాల లూగుచు సముద్రలహరులవలె ఎటు చూచినను పచ్చగా కంటికింపుగా కనిపించుచు ఆనందము నిచ్చుచున్నవి. కంకులలో పశుపక్షులను మానవులను పోషించు కామధేను దుగ్ధమువంటి పాలునిండియున్నవి. ఇట్టి సమయమందు ఆ దిక్కులేని పక్షులు దంట్లపై ఉయ్యాల లూగుచున్నవి. ఆకులలో దాగుడు

మూతలాడుచున్నవి. బడినుండి తప్పించుకొని పోయిన అల్లరి పిల్లలవలె రంతులు పెట్టుచున్నవి. తల్లిని పీడించి చిరుతిండి తిను శిశువులవలె ఆ పిట్టలు కంకులను పొడిచి పొడిచి పాలగింజల మెక్కుచున్నవి.........పక్షుల జీవితమే ధన్యమైన జీవితము. రేపటి చింత వాటికిలేదు. అట్లు జీవించువారే ధన్యజీవులు......... ఈ చేలకావు పెడిసెలను జోపుమనికదా నాకీ కట్టెనిచ్చి పోయినది. ఇది అలంకారముగా ఉండదగినదే కాని దండనకు ఉపయోగింప గూడనట్టిది. దిక్కులేని పిట్టల నోరుగొట్టుట క్రూరమగు కార్యము. అయినా అవితింటే యెంత తింటవి.........పిట్టలారా, మీరు నాచేతి కర్రను చూచి భయపడినారా ఏమి? ఏమాత్రమున్నూ భయపడ వద్దు. కడుపునిండా తినండి. మళ్లీ యిట్టికాలము ఒక సంవత్సరానికి వస్తుంది.........సాయంకాలము కావచ్చినది. మీ గూళ్లకుపొండు. మరల భల్లున తెల్లవారినప్పుడు రండు.

(అవనిక పడును)



# ప్రఘట్టకము ౬

జిజీబాయి—తుకారాముని వెదకుచున్నది.

(స్వగతము)

నేటికి నెలదినాలైనవి అయన వెళ్ళిపోయి. పున్నమనాడు వెళ్ళి నాడు. మళ్లీ పున్నమ రావేవచ్చె. నా ప్రాణనాథుడు ఎప్పుడైనా ఎక్కడికైనా వెళ్లితే మూడు నాలుగు దినాలలో తిరిగి వచ్చేవాడు. అయనగారికి కోపం రానేరాదు. ఈతడవ మాత్రం కోపం కనిపించుకొన్నది. నేనేమి అనరాని మాట అన్నానా? ఏమైనా చెడ్డపనులు చేసినానా? అయనకు సంసారం కాబట్టక పోయెను. నా సొమ్ములమ్మి పైకమిచ్చి వ్యాపారం చేయమంటే అంతా దాన ధర్మం చేసివచ్చెను, ఇట్లు అంతాపాడుచేస్తే బ్రతికేదేలాగు అని అంటే తప్పు వచ్చెనా? ఇంతకే ఇంతైంది. జిజీబాయి రాకాసిముండమ్మా, గొవువంటి సాధువును, తనమగనిని ఇంటినుండి వెళ్ళగొట్టింపమ్మా అని అమ్మలక్క లంతా నన్నే ఆడిపోసుకొంటున్నారు. ఎటువచ్చి ఆడుదానిదేతప్పు. ఈ అప రాధానికి ప్రాయశ్చిత్తం పెట్టుకొంటున్నా. ఊరూరు తిరుగుతూ యెంత దూరం వచ్చినా. ఇంకా వారిజాడ కానరాకపోయెను. పాపమాయనకేమేమి కష్టాలు కలిగినవోయేమో. అన్నెముపున్నెమెరుగని మేదకుడు. పిల్లలవంటి మెత్తని మనసుగలవాడు. సుకుమారి. దారిలో ఎవ్వరెవ్వరేమేమి కష్ట పెట్టిరోయేమో? సమయానికి కూడుపెట్టే దిక్కులేక ఎంత అవస్థపడినాడో, అడవిలో గుట్టలలో తిరిగి రాళ్ళు, ముళ్ళు కుచ్చుకొని అయన కాళ్లెంత బొప్పి పట్టెనోపాపం. దీనికంతా కారణం నేనేకదా...... అయన సంపాదించకుంటే మానె. ఇంట్లో సుఖంగాఉంటే అదే పదిలక్షలునాకు................... దేవీ, భవానీ, నీకింకైనా దయరాదా? ఎంతకాలము నాకీగ్రహచారం అనుభ వింపవలసి ఉంటుందోకదా......అడిగినవారందరూ మావారు ఈ ప్రాంతా లలోనే ఉంటారన్నారే. అయన దొరికేవరకు నేనిట్లే వెదకుతూనే ఉంటాను. అయనలేని సంసారం నిస్సారంగాఉంది. అయన దొరకకుంటే నేను మాత్రం ఇక బ్రతికిఉంటానా.

(నిష్క్రమించును)

# ప్రఘట్టకము ౭

తుకారాం. మంచెపై ధ్యానముద్రలో

(కొంతసేపటికి)

జయ మహాదేవవిఠ్ఠల్ జయ శ్రీ పాండురంగవిఠోబా

(దండకము) శ్రీపాండురంగా, విఠోబా, దయాసింధు, కల్యాణమూర్తీ, చతుర్వేదవేదాంతవేద్యా. ప్రభాజాలదేదీప్యమానాంగ, సర్వ ప్రపంచాంతర వ్యాప్త తేజోవిరాజన్మహాదేవ, భక్తాళిసంరక్షకా, కోటిసూర్యప్రభాభాసమానా, సదాసజ్జనత్రాణదీక్షాపహా, దుష్టనిర్మూలనోత్సాహసంపూరితాత్మా, మద క్రోధలోభాద్యవిద్యాంధకారస్ఫురత్తీవ్రదీప్తా, కృపాపాంగవీక్షన్ ననున్ ధన్యుఁగావింపవే. సర్వకాలంబులన్ నిన్ను సేవించువాంఛం జుమీ, విఠ్ఠలా! నాకు నీ దివ్యరూపంబు చూపించి, రక్షించి, మోదంబు సంధింపవే, యోర మావల్లభా. మన్మనోలాస, యోపాండురంగా! నమస్తే నమస్తే, నమః

(ధ్యానించుచుండును)

[కూర్మినాను – ఇద్దరు మధ్యవర్తులతో వచ్చును.]

కూర్మి:- నేనింతవరకూ మీతో చెప్పింది నిజమో అబద్ధమో మీరే చూడండి. మీరున్నూ నావంటి కాపువారేకదూ. మీ చేలను కాచేవారిట్లా కండ్లు మూసుకొని కునికిపాట్లు పడుతుంటారా? చెప్పండి. ఇతడేమి చేస్తు న్నాడో గమనించండి. దిష్టిబొమ్మవలె పొలిమేర దేవరవలె చెరబిగిసి కూర్చున్నాడు. చేతిలోని కర్రనుకూడా సరిగా పట్టుకోకుండా ఉన్నాడు. మొన్నమొన్ననే వచ్చిపోయిన పిచ్చిస్వాములవలె ఏమేమో తనలోతానే గొణుగుకొంటూ ఉన్నాడు. ఇతన్ని కావలిపెట్టే దాని కంటే ఒక దిష్టిబొమ్మను చేసిపెట్టి వుంటే బాగుండేది.

గప మధ్య:- ఉండవయ్యా, ఒకటే వదరడం. నేనడిగిందానికి సమాధానం చెప్పు. ఇతన్ని ఎందుకు కావలి పెట్టినావు.

కూర్మి:- ఈ పొలాలచుట్టూ ఊరక తిరుగుతూ ఉండినాడు. ఎవడో పాపం దిక్కులేనివాడు. నమ్మకంగా పనిచేస్తాడని కావలి కేర్పాటు చేస్తిని.

౧ మధ్య:- ఎన్నిదినాలైంది.

కూర్మి:- మూడు వారాలైనవి.

౧ మధ్య:- ఏమి కూలి ఏర్పాటు చేసినావు.

కూర్మి:- పండిన దానిలో పదో భాగం ఇస్తానన్నా. పైగా దినం రెండు పూటలా భోజనం పెట్టించినాను.

౧ మధ్య:- అతన్నికూడా విచారిస్తాము. ఏమంటాడో వినుకొన్న తర్వాత తీర్పు చెప్పతాము.

౨ మధ్య:- అతన్ని చూస్తే మెత్తని పులివలె కనబడుతాడు. వీరేమిన్నీ తగవులాడకుండా చూడండి.

౧ మధ్య:- తగవులాడితే వారియిష్టం. మనకు తోచిన న్యాయం మనము చెప్పిపోదాము.

౨ మధ్య:- అంతేమరి. అతని వాలకంచూస్తే ఉన్మాదం మనిషివలె కనిపిస్తున్నాడు.

కూర్మి:- అట్టి భయం ఏమిన్నీలేదు లెండి. అతనికి దేవుని భక్తి మెండుగా ఉందని నాతో చెప్పినాడు. భక్తిపరుడైతే నమ్మకంగా పనిచేస్తాడని ఆశపడితే తుదకు ఈ విధంగా చేలను పిట్టలకు నక్కలకు, అప్ప జెప్పి కూర్చున్నాడు. అతని ముల్లె ఏం పోయింది కనుకా.

౧ మధ్య:- అతని పేరే మంటివి.

కూర్మి:- తుకారాం.

౧ మధ్య:- అయితే పదండి. విచారిస్తాము. ఏమయ్యా, తుకారాం గారూ కాస్త యిట్లా దయచేయండి.

(తుకారాం కనులు తెరచి చూచి మంచెనుండి దిగి)

తుకా:- మహానుభావులారా, మీకందరికిన్నీ నమస్కారాలు. ఏమి ఆజ్ఞ సెలవియ్యండి.

౧ మధ్య:- ఏమయ్యా, నీవీ చేలకు కావలి కాస్తున్నావా?

తుకా:- చిత్తం.

౧ మధ:- మరి ఇదేమి కావలయ్యా, చేలుకాచే వారంతా కండ్లుమూసుకొని గుడిలోని విగ్రహాలవలె కూర్చుని ఉంటారా నీవే చెప్పు మరి.

తుకా:- చేలకు నష్టము కలుగకుండా, దొంగలు దోచుకొనకుండా చూచు కొన్నానండీ.

౧ మధ్య:- నీపైన ఈ కూర్మిదాసు నేరము మోపుతున్నాడు. దానికే మంటావు.

తుకా:- నేనేపాపమున్నూ ఎరుగనండీ. పెద్దలైన మీరు నాదోషము నిరూపించి ఎమితీర్పు చెప్పితే దానికి బద్ధుడనై ఉంటాను.

౧ మధ్య:- (రెండవవానితో) చూచినావోయి. ఈయన సాత్త్వికుడు. నీవూరకే అపోహపడినావు. (కూర్మిదాసుతో) ఓయీ, నీవేమి పంచాయతి చేస్తున్నావో అదంతా ఈ తుకారాం ఎదుట చెప్పవయ్యా.

కూర్మి:- తుకారాం. నిన్ని పొలాలను కాచుటకై పెట్టింది నిజమేనా? పిట్టలను జోపుచుండుమని చెప్పితినాలేదా? ఈ కట్టెకూడా అందుకుగాను నీకిచ్చినానాలేదా? మరి నీవు చెప్పినట్లే చేసినావా నీ ధర్మంగా నీవే చెప్పు.

తుకా:- స్వామీ, నేను పగలంతా ఈ మంచెమీదనే కూర్చున్నా, రాత్రి కూడా మెలకువతోనే ఆ గుడిసెలో ఉంటూవచ్చినాను. దొంగలెవ్వరున్నా చేలలో పడలేదు.

కూర్మి:- మరి పిట్టలు పెడిపెలు జోపినావా? అసంగతి చెప్పవు.

తుకా:- జోపలేదు. పిట్టలెంతతింటే ఎంత నష్టమవుతుంది. వాటిని దోలుట అన్యాయమనుకొన్నా.

కూర్మి:- ఇతడు అబద్ధము చెప్పుతున్నాడండీ.

తుకా:- ఏమయ్యా ఎంతటి ఘోరపాతకము నా కొడిగట్టినారు.

స్వీయ సంపదలన్నియు జీర్ణమైన
బంధు మిత్రాదులెల్లరు వదలిరేనిఁ
గండలుగ నీ శరీరంబు చెండిరేని
సూనృతంబును దప్పను సుంతయైన.

కూర్మి:- అయితే, దొంగతనము కాకుంటే చేలంతా ఇంత పలుచబడినవెందుకు.

తుకా:- పెడిసెలు పిట్టలు తప్పితే మరేమిన్నీ ఈ చేలలోకి రాలేదండి. నామాట నమ్మండి.

కూర్మి:- అట్లైనా నష్టం కొంచమౌతుందనుకొన్నావా? పెద్దమనుషులు మీరే పరిష్కారం చెయ్యండి.

౧ మధ్య:- (తక్కిన వానితో) ఏమన్నా, పట్టలు కాచేదానికి, తుకారాముని ఏర్పాటుచేస్తే ఈయన ఆపని చేయకుండా వాటికే చేలను సెలవు పెట్టినందున తుకారాముదే తప్పని తోస్తుంది. నివే మంటావు.

౨ మధ్య:- అంతే. ఇతనిదే తప్పు.

౧ మధ్య:- తుకారాం. నీయందే తప్పుందని నిర్ణయిస్తున్నాము. వచ్చే నష్టాన్ని నీవు కూర్మిదాసుకు కట్టియ్యవలెను విన్నావా?

తుకా:- చిత్తము. మీ అభిప్రాయం ప్రకారం వర్తించుకొందును. నష్టంతీర్చే శక్తి లేకున్నా కూర్మిదాసువద్ద జీతముండియైనా విముక్తుడనౌతాను.

౧ మధ్య:- కూర్మయ్యా, ఈ రెండు చేలలో ఎంత పండుతుందని అనుకొని యుంటివి.

కూర్మి:- రెండుపుట్లకు తక్కువ పండదని ఊర్లో అందరున్నూ అన్నారు. విచారించుకోండి.

౧ మధ్య:- (౨వ మధ్య వర్తితో) నీవే మంటావు.

౨ మధ్య:- ముప్పందుము అవుతుందని నేననుకొని యుంటిని.

కూర్మి:- ఇవి మంచి పొలాలండీ. చాలా సత్తుపెట్టినాను. గొర్లమందలాపినాను. రెండుపుట్లకెక్కువగానే పండేవి కాని తక్కువకావు.

౧ మధ్య:- సరే. మేము తీర్పు చెప్పుతున్నాము. వినండి. ఈ పొలాలలో ముప్పందుము పంట పండవలసి యుండెను. కోతలైన తర్వాత దీనిలో పదో భాగం తీసివేసిన తర్వాత పోగా ౨౭ తూముల జొన్నలు లేకపోతే ఎంతతరుగు వస్తుందో అంత యీ తుకారాం కూర్మిదాసుకు కట్టియ్యవలెను.

౨ మధ్య:- ఎక్కువ వస్తే

కూర్మి:- ఇదోనండీ, నాకు అధర్మంగా సంపాదించే కోరికలేదు. ముప్పందుం కంటే ఎక్కువ ఎంతవచ్చినా అదంతా తుకారాముకే ఇచ్చివేస్తా.

౧ మధ్య:- వస్తేకదా. రాదని అందరికిన్ని తెలుసు. అందుచేత ఇంతత్యాగం చేసినావోయ్ నీవు. ఏం తుకారాం. నీవేమంటావ్.

తుకా:- పంచాయతి అనేది ధర్మాసనము. పంచాయతీ పెద్దలు ధర్మమూర్తులు వారి తీర్పును అంగీకరించని వాడు పంచమహాపాతకాలను

చేసినవాడౌతాడు. అదే విధంగా ధర్మాసనములో కూర్చొని అధర్మ, ముగా కాని పక్షపాతముగా కాని తీర్పుచెప్పే పెద్దలు నరక బాధ పొందడమేకాక వారికి వంశక్షయమున్నూ అవుతుందని అంటారు. కావున మీ నిర్ణయమునకు శిరసాబద్ధుణ్ని అవుతున్నాను.

౧ మధ్య:- సరి. వచ్చినపని తొందరగా పరిష్కారమైంది. ఇక పదండి. వెళ్లుదాము.

(నిష్క్రమింతురు)

తుకా:- (స్వగతము)

దుర్గమారణ్యసీమల దూరియైనఁ
చనరు పర్వత గుహలలోఁ దాగియైన
నిర్జనప్రదేశంబుల నిలిచియైనఁ
బ్రాప్తి లంఘింపవశమె యాభవునికైన.

నాకిప్పుడు సంప్రాప్తమైన దురవస్థకు విచారింపనవసరములేదు. అంతయు దేవుని లీలయే. పాండురంగా, నీకు నాపై కరుణ ఎన్నడు కలుగుతుందో? నీమూలాననే నేను నా భార్యా పుత్రులనుండి దూర మైతిని. వారిని దిక్కులేని పక్షుల జేసితిని. నేనున్నూ అడవుల పాలై తిని. ఇక్కడనైనా నన్ను సుఖముగా ఉండనిచ్చినావా? నన్నొక దొంగను చేయించినావు. నీపూజ సేయుటవల్ల ఇదేనా నాకు దొరక దగిన ప్రతిఫలము. విపత్తులు వచ్చిన అవి గుంపుకట్టియేవచ్చును. క్షణమాత్రశారీరిక సుఖమును గోరి విపత్తులనుండి మాయోపాయ ములచే తప్పించుకొనగోరువారల్పులలో నల్పులు. వాటికి జంకక తన నియమములను తప్పక పాలించుకొనువాడే ముక్తుడు. పాండు రంగా! విఠ్ఠలప్రభూ! నాకీ విపజ్జలధినుండి తరించుటకై శక్తిని ధైర్య మును ప్రసాదింపుము. ఇంతకన్న నెక్కువ నిన్ను గోరుటలేదు.

తోదకము

జయ జయ కేశవ ! సజ్జనమిత్రా !
జయ జయ విఠ్ఠల ! సాంద్రదయాళూ !
జయ జయ మాధవ ! చారువిలాసా !
జయ జయ దుర్జన శక్తివిభంగా !

[చూడుడు అనుబంధము]

# ప్రఘట్టకము ౨

విఠోబా—మాల, భక్తుడు, నల్లనివాడు. ఎత్తయినవాడు, మీసాలున్నవి. మోకాటిపైననే ధోవతి, నెత్తిన చిన్నరుమాల. వీపున చిన్నసెల్లా. మాస్వాజీ మఠము బయటిభాగములో ఉన్నాడు.

(స్వగతము) నా కర్మమిట్లా మూడింది. నేను పుట్టింది మాలజాతి. కులము చెప్పుకొంటే తిట్టిపోతారు. మాట్లాడితే కొట్టిపోతారు. పొరపాటుతో తాకితే కట్టుబట్టతో దిగపార తానం చేస్తారు. పైకులాలవారుచస్తే మాత్రంమమ్ములను పిలిపించుతారు, చెప్పులు మేమేచేసి యియ్యా వలె. వాటికి అంటుముట్ట దోషంలేదు, మరి సేద్యము పనిముట్లు తోలుపగ్గాలు, కళ్లెములు, జీనుగంతలు, ఇట్టివంతా అంటవచ్చును వాడవచ్చును. ఏ వస్తువును ముట్టినా తప్పులేదు. మమ్ము ముట్టు తూనే తప్పవస్తుందట. ఇట్లా అంటే మెత్తగా ఉంతారు. అయన పుణ్యామా అన్నట్లు ఆ తుకారాంమారాజు దగ్గరికితీసి ఒరే నాయనా, విఠ్ఠల స్వామిని దినం భజనసేయురా అని ఉపదేశం చేసినారు. ఇట్లాటి మహాత్ములు అందరికీ దొరుకుతారా. ఆ గురుదేవుడు ఇంకో నాడు ఇట్లా బుద్ధిసెప్పినాడు. ఒరే విఠోబా, ఎప్పుడున్నూ నీకు చేత నైనంత పరోపకారంచేస్తూఉండు. ఎవరేమన్నా సరే ఓర్చుకొనిఉండు. కన్నతల్లికంటే ఎక్కువదయతో ఇంతబాగా బుద్ధిచెప్పేవారేదీ? ఎక్కడ వెదికినా దొరకరు............ఇది మాస్వాజీ మారాజుమఠం. ఎందుకో అంతా చెత్తాచెదారంతో నిండింది. ఇక్కడికి పెద్దమనుషులు వస్తుంటారు. అంతా శుభ్రంచేస్తాను......

[ ప్రవేశము - మాస్వాజీ ]

మా:- ఎవడవురా నీవు.

విఠోబా:- దండము. బాబాజీ. దండముపెట్టితి.

మా:- నీ వెవడవంటే దండం అంటావేమిరా?

వి:- నేనూ ఒక మనిషినే స్వామీ.

మా:- అది నీరూపంచూస్తూనే తెలిసిందిలే. నీపేరేమి.

వి:- నన్ను విఠోబా అని పిలుస్తారండి.

మా:- నీదేంకులం.

వి:- నాకు కులంగిలం లేదు మహాత్మా.

మా:- కులంలేకుంటే నీవు భ్రష్టుడవైనావా?

వి:- నేను హిందువున్ని.

మా:- హిందువైతే కులం ఎందుకు చెప్పవురా?

వి:- పాండురంగ సేవకులము మేము.

మా:- అది కులంకాదు. నీవు ఇప్పుడు కులంవదలిపెట్టిననూ, నీవేకులంలో పుట్టినావో అదైనా చెప్పవిందాము.

వి:- అయ్యా, నేను మహర్ అనే మాలకులంలో పుట్టినాను.

మా:- ఆఁ అట్లాచెప్పు. అందుకొరకే యింతరాద్ధాంతము చేసినావు. కులం చెప్పేవరకు ఇంత అవస్థ అయింది. ఒరే చండాల వెధవా! నీకేమిన్నీ భయంభక్తీ ఉందా? ఉంటే పెద్దా చిన్నా నీకు కనబడినట్లులేదు. మా మఠంవద్దకు ఎంకుదు వచ్చినావురా. దీన్నిమైల చేసినావు. పుణ్యాహవాచనం చేసేవరకు ఎంత అవస్థ అవుతుందో తెలుసునా కుంకా.

వి:- ఏమండీ స్వామీ, నేను మీమఠాన్ని ముట్టుకొన్నానా? మీ ఆవరణంలోనికైనా వచ్చినానా? బట్టబయట దూరంగా నిలిస్తే కూడా మీ మఠానికి మైల తగులుతుందా? నేను మిమ్ము పలుకరించినానా? మీదిక్కైన చూచినానా? ఊరకనే ఎందుకు ఎగబడివస్తారు. ఎందుకు నోటికి వచ్చినట్లు తిట్టుతారు.

మా:- ఓహెూ, ఏం శాంతం, ఏం వేదాంతం నీవు కూడా ఏ పీఠాధిపతివో కాదగిన వాడవురా! నేనిప్పుడే స్నానంచేసి వస్తిని. నిన్ను కట్టెతోకొట్టినా మైల పడుతాను. మళ్లీ స్నానం చేయవలసి వస్తుంది.

వి:- స్వామీ, నేను మాత్రం స్నానం చేయకుండా వచ్చినాననుకొన్నారా మీరు. దినం స్నానం చేస్తాను. దినం ఉదికిన బట్టలు కట్టుకొంటాను. పొద్దునా సాయంత్రం పూజ చేసుకొంటాను.

మా:- నీకూ దేవుడూ దైవంకూడా ఉన్నాడా. ఎవడురా నీ దేవుడు.

వి:- అందరికుండే దేవుడు నాకున్నూ ఉన్నాడు. ఎవరికి తోచినట్లు వారు దేవునికి పేరుపెట్టి పూజిస్తారు. మరినేనో, గురూపదేశం పొందినప్పటి నుండివిఠ్ఠలస్వామిని ఆరాధించుతున్నా.

మా:- నీకుగూడా ఒక గురువు అనేవాడున్నాడా. ఎ వ డు గు రు వు విందాము చెప్పు.

వి:- చిత్తము. మా గురుదేవుడు శ్రీ సంత్ తుకారాం స్వామిగారు,

మా:- ఆం. అట్లాచెప్పు. మాదిగవానికి మాలగురువు దొరికినాడు. ఆ మాల వెధవ నీకు తగినవాడే. వాని శిష్యుడవు కనుకనే ఇంతసేపు భయము లేకుండా నా యెదుట వాగుతూ ఉన్నావు.

వి:- బాబాజీ, నన్ను మి యిష్టం వచ్చినట్లు తిట్టండి. ఓర్చుకొంటా. కాని మా గురువు దేవుని ఏమిన్నీ అనవద్దండి.

మా:- ఎంత పొగరురా నీకు. బాగా కొవ్వుపట్టినావు. ఇంతవరకు నేను శాంతంగా మాట్లాడుతూ ఉంటే మరీ నీల్గుతున్నావు. "చమారుదేవునికి చెప్పుల పూజనే కావలె" అన్నట్లు నీకున్నూ అదే సంస్కారం చేస్తున్నా. ఇదో తీసుకో, (కట్టెతో మోదును)

వి:- జై విఠ్ఠల్ ! (మరొకదెబ్బ) జై పాండురంగా !! (మరొకదెబ్బ) జైతుకారాం గురుమహదేవ్ !!!

మా:- వెళ్లూ. చండాలపు వెధవా. లేకపోతే నీ వీపు బ్రద్దలుచేస్తా.

వి:- జయ విఠ్ఠల్, హరి విఠ్ఠల్

(అని పాడుచూ నిష్క్రమించును)



# ప్రఘట్టకము ౯

ఇంద్రాణీనదీసమీపమందు తుకారాం

ఎన్నిదినాలైనది ఈ ఇంద్రాణీనదిని చూడక. దేహూగ్రామమంటే నాకదిరెండవతల్లి. ఈ ఇంద్రాణీ నది తల్లివలె నావంటివారి నెందరినో పోషించుతున్నది. ఈ నదీ తీరంలో నెలకొనిఉన్న విఠలనాథుడు తండ్రి వలె భక్తులనందరినీ కనిపెట్టుకొని ఉంటాడు......అయితే ఇప్పుడెందుకో నామనస్సులో ఆనందానికి మారుగా కాస్త బాధ కనిపిస్తున్నది. మళ్ళా సంసార తాపత్రయములో తగుల్కొని అవస్థపడుతానేమో అనే భయము. నా భార్యా పుత్రుల చింత మనస్సులో అవరించుతున్నది. నా జిజీకి కోపం శాంతించి ఉంటుందో లేక ఇంకా తదేకదీక్షతోనే ఉన్న దేమో? నా పిల్లలు ఎప్పుడూ ఆకలి ఆకలి అనేవారు. వారెంతెంత పరితపిస్తున్నారో ఏమో?

భార్యను కట్టుకొంటే అనుకూలవతియయ్యేనా మంచిశాంతిసౌఖ్యములు కలుగుతవి. గయ్యాళి అయ్యేనా చాలావేధగా ఉంటుంది. నాజిజీకి అన్ని లక్షణాలుబాగానే ఉన్నవికాని భగవద్భక్తి మాత్రంలేదు. పైగా ఎప్పుడూ సంసారం సంసారం అంటూ ఉండును, ఆ కారణముచేత తొందర, కోపం కాస్త యెక్కువగానే చూపించుతూ ఉండును. అయినా బహుకాలము సఖ్యము కుదిరిన తర్వాత భార్యలేకుంటే జీవితములో ఏదో శూన్యత కనిపించుతుంది.

తావిలేనట్టి పూవువిధంబుగాదె
దివ్వెలేనట్టి గేహంబు తీరుగాదె
కంకణాలంక్రియలులేనికరముగాదె
భార్యఁబాసిన జన్మ దుర్భరము కరము.

జగత్సాక్షి, సకలప్రాణి పరిపోషకుడు, త్రికాలాధిష్ఠానదేవత, త్రిమూర్త్యాత్మకుడు, అయిన సూర్యభగవానుడు, ఉషాదేవియొక్క కాషాయ చేలాంచలమును పట్టుకొని ప్రాచీన సౌధాంతరాళమునుండి బయటికి వచ్చుచున్నాడు. సమస్త పీడానివారకుడగు బాలసూర్యుని ఉపాసించుటకు

ఇట్టి సమయమే సర్వోత్కృష్టమైనది. త్వరగా ఇంద్రాణీనదీమతల్లిపవిత్ర జలావగాహుడనై సంధ్యాపూజను, విఠ్ఠలస్వామిధ్యానమును చేసికొనవలెను.

(జిజీ ప్రవేశించి తుకారాం వస్త్రమును పట్టుకొని)

ఏమండీ. కోపం ఇకనైనా శాంతించినదాలేదా? నా తప్పులన్నింటినీ క్షమించవలెనని మీపాదములంటి వేడుకొంటున్నాను.

(పాదములపై బడును)

తుకా:- జిజీ. నీకు నిండా నూరేండ్లు అయుస్సు. నేనిప్పుడే నిన్ను తలచుకొంటిని. అంతలోనే దేవతవలె ప్రత్యక్షమైనావు. నేనిచ్చటికి వచ్చినదెట్లు గుర్తించినావు.

జిజీ:- స్వామి, మీరిన్ని దినాలు ఎచ్చట ఉంటిరో, ఎంతకష్టపడినారో, విచారించే వారులేక ఎంతచిక్కిపోయినారు పాపం. మీకొరకు దినమూ వెదకుతూనే ఉంటిని. భాస్వానాథ పర్వతాలకుకూడా వచ్చి వెదికినాను. మీరీదిక్కే వచ్చినారని అచ్చటివారు కొందరుచెప్పిరి. మిమ్ము నేను అనరానిమాటలంటిని.మీకపచారంచేసినాను. నన్నుక్షమించరా?

తుకా:- క్షమించుటకేముంది. ఆనాడే నిన్ను క్షమించినాను. నీపైననాకెన్నటికైనా కోపం వస్తుందా.

జిజీ:- మీరు అంతటి ఉదారులని నాకు బాగా తెలుసును. ఇకనైనా ఇంటికి పోదము పదండి.

తుకా:- వచ్చే వీలులేదు.

జిజీ:- మీరురాకుంటే మీ వెంటనే నేనున్నూ వస్తాను. మీరెక్కడ ఉంటే అక్కడే నాకున్నూ నివాసం.

తుకా:- నీవు ఆడుదానవు. కష్టాలకు తట్టుకొనలేవు.

జిజీ:- మీరు వెళ్లిపోయినప్పటినుండీ కష్టాలులేకుండా సుఖంగా ఉన్నానా మరి. ఒంటిపూట భోజనంచేస్తూ వచ్చినాను. కూలినాలిచేసి పిల్లల పోషించినాను.

తుకా:- అయ్యో, ఎంతకష్టపడినావు. శ్రీహరీ, ఎందుకు నాకుటుంబానికిట్టి సంకటాలు కలిగించినావు. జిజీ! నీవు కూలిచేసినావా? నీ కోమలమైన చేతులెంత నొచ్చెనో ఏమో.

జిజీ:- పాపం. గంగాధర పంత్ అట ఆయనపేరు. ఆయన పుణ్యమా అన్నట్టు గౌరవంగా ఆయన యింటిలో కొలువు చేసినాను. ఆయనకు ఈమధ్య మీమీద భక్తి కుదిరింది. ఇంతవరకూ మాస్వాజీ బాబాగారి శిష్యుడుగా ఉన్నాడు.

తుకా:- ఎవరామాస్వాజీ స్వామిగారు.

జిజీ:- ఆయన బ్రాహ్మణులు. కాళీ ఉపాసకుడట. ఆయనకు చాలామంది శిష్యులున్నారట.

తుకా:- అట్లైతే మనగ్రామం చాలా పవిత్రమైపోయిందన్నమాట.

జిజీ:- దయచేయండి. వెళ్ళుదాము.

తుకా:- నీవు నన్ను వెదకుచూ చాలా దినాలు తిరిగినావంటివే. మరి మన చిన్నపిల్లలగతి యేమిచేసినావు.

జిజీ:- మీరువెళ్ళిన వారందినాలకు మా అమ్మగారువచ్చి వారిని పిలుచుకొని పోయినారు. అక్కడ వారు సుఖంగా ఉన్నారు. అంతా సరే కాని ఇంటికి వెళ్లువాముఠండీ అంటే పలుకరేమి? చూడండి. మీరు రాకుంటే మీతోపాటిదే నాలోకమున్నూ. అదిమాత్రం తప్పదు.

తుకా:- జిజీ ! నేను ఇంటికి వచ్చినా రాకున్నా నా విఠోబా ధ్యానం, నావిశ్వసేవావ్రతం ఎన్నటికీ విడువజాలను. అక్కడనే నీకూ నాకూ అభిప్రాయభేదం. కావున పొత్తుఎట్లు కుదురుతుంది చెప్పు నీవే.

జిజీ:- అన్నీ కుదురుతవిలెండి. ఇక బుద్ధివచ్చింది. మీరేమిచేసినా నేనేమిన్నీ అడ్డుపెట్టను.

తుకా:- అట్లైతేసరి. ఇంద్రాణీనదిలో స్నానం చేసుకొని దేవుని దర్శనం చేసుకొని వెళ్లుదాముఠా.

(నిష్క్రమింతురు)



# ప్రఘట్టకము ౧౦

మాస్వాజీమఠములో—మాస్వాజీ శిష్యులు.
గంగాధరపంత్, శంభాజీ.
శంభాజీ శూద్రుడు, పరిచితుడే

గంగాధరపంత్ - బ్రాహ్మణుడు. వయసువాడు. సన్నని మీసాలు. బక్క మనిషి. నొసట గంధపు రేఖలు. చంకమీదుగా సెల్లా. పట్టుంచుపింజ ధోవతి. స్ఫురద్రూపి నెత్తిన పగిడీ (పూనా)

గంగాధరపంత్:— శంభాజీ, ఏమో శూద్రుడుకదా అనుకొని తుకారాముని సేవించుటకు మారుగా బ్రాహ్మణుడైన మాస్వాజీని సేవించుదామని వీరి శిష్యుణ్ని అయితిని. కాని మాస్వాజీచేసే కార్యాలన్నీ నీచంగా ఉన్నవి. మతం పేరుచెప్పి మాంసంతింటాడు. సారాయి తాగుతాడు. సుందరి అనే భోగపుసానిని ఉంచుకొన్నాడు. ఇంతకంటే మించిన దుశ్చేష్టలింకేమి కావలెను.

శంభా:- మరి శూద్రుడైన తుకారాంలో ఏం గొప్పతనం కనిపెట్టినారు.

గంగా:- తుకారాం వరకవి. ఆయన రచించిన అభంగాలు పండిత పామరులనందరినీ ఆకర్షించి ఆనందింపజేసినవి, మన మాస్వాజీకి పాండిత్యంనున్న. యం అంటే ఢం అనలేడు. పైగా కోపం,తామసం ఎక్కువ. తుకారాంగారు సత్యశాంత స్వరూపులు.

మలయజమునీడ సర్పంబు మసలినట్లు
గర్వమొప్పును పండితగ్రామణులకు
స్వర్ణభూషణమందుండు వజ్రమటుల
వినయమొప్పును విద్యాప్రవీణతతికి.

శంభా:- బ్రాహ్మణులైన మీరు శూద్రునిగొలుచుట కంగీకరింతురా?

గంగా:- జ్ఞానాన్వేషకులకు గుణమేప్రధానము. తుకారాం విశ్వసేవావ్రతము నవలంబించిన మహాత్ముడు.

శం:- విశ్వసేవావ్రతమంటే యేమిటి?

గం:- నిష్కామకర్ములై జాతి, మత భేదములను పాటింపక శక్తికొలది మానవులకును, పశుపక్ష్యాదులకును సేవచేయుటయే విశ్వసేవా వ్రతము. ఇవన్నీ తుకారాం సాధారణముగా చేయుచుండును.

దేవతానిలయంబు త్రోవలోనుండెడి
కంటకంబులనేరి కడకువేయు,
మూటల వీధిలో మోయుచుఁ గష్టించు
దీనులతాపంబు దీర్చుకొంత
తైర్థికుల్ వచ్చినఁ దడవుసేయకపోయి
సౌకర్యములఁగూర్చి సాయపడును.
గట్టునూఁతగఁగొంచుఁ గష్టించువృద్ధుల
వీఁపుపైఁ గొనిపోవు వేధయనక

తాపమొందెడు పసులకు ధాన్యమొసఁగుఁ
దప్పిగొనుగోవులకు నీరుద్రాపుచుండుఁ
గానువైనఁ గోరకజీతగానిపగిది
సేవసేయు నానజ్జనశేఖరుండు.

తుకారాం కీర్తిమహారాష్ట్రదేశమంతటను ప్రాకిపోయినది.

శం:- అవునండీ. రెండునెలలక్రిందటనేమో శ్రీ శివాజీ మహారాజుగారు వారికి 3000 రూపాయిాలంపియుండిరి.

గం:- వాటిని తీసుకొన్నారా

శం:- అప్పుడాయన ఊరిలో లేకుండెను. అయన భార్య జిజీబాయి వాటిని తీసుకోనన్నది.

గం:- పోయిననెల శ్రీ ఛత్రపతి మహారాజాగారు వారిని దర్శించుకొనవలె నని పల్లకీని నవార్లను సిబ్బందిని పంపగా నాకు అస్థానాలతో నిమి త్తము లేదని తుకారాం స్వామిగారు వెళ్లకపోయిరట.

శం:- మన మాస్వాజీ బాబాగారై యుండినట్లైతే చంకలు కొట్టుకొంటూ అట్టహాసంగా వెళ్లియుండేవారు. అయితే ఒకమాట. మనమున్నూ తుకారాం స్వామి నాశ్రయింతమా?

గం:- దానికేమి సందేహం. కాని వారి వ్రతమును మన మాచరించలేము. వారికి సత్యమే ప్రధానము. అహింసయే వారిముఖ్య ధర్మము.

శం:- అట్టివారివద్దనే మనకు ముక్తి లభించును. శక్తికొలది వారిబోధల నాచరింతము ఏమంటారు. నాకేమో యీ మాస్వాజీ సేవలు ఏమిన్నీ సరిపడవు.

గం:- నీకంటే ఎక్కువగా నాకు అసహ్యమై పోయిందోయ్. అదుగో, మాస్వాజీ యిటేవస్తున్నాడు చూడు.

(మాస్వాజీ ప్రవేశించును)

మా:- ఏమిరా, ఏమిటో గుసగుసలాడుచున్నారు.

శం:- చిత్తము. తమరిముచ్చటనే మాట్లాడుచుంటిమి. మరి తుకారాం చర్చకూడా చేసినాము.

మా:- వాడు దుర్మార్గుడు, దుశ్శీలుడు. వానిపేరు నావద్ద ఎత్తవద్దు.

గం:- ఎంతమాట పలికితిరి. సంత్ తుకారాంగారు చాలా గొప్పవారు.

పరమపూరుషు నేవేళభక్తికొలఁది
సేవచేసెడివాఁడు దుశ్శీలుఁడగునె?
"ఆత్మవత్సర్వ భూతాని" యనెడురీతి
మదినిఁ బ్రేమించువాఁడు దుర్మార్గుఁడగునె?

ఆయన రపమ భాగవతోత్తముడు.

మా:- నాకంటే నీకు చాలా తెలిసినట్లుందే. శూద్రునికేమి. శాస్త్రాలు వచ్చే దేమి? వానికి భక్తి ఉన్నదంటే అది మూఢభక్తి. పైగా వాని శిష్యు లెవరో నీకు తెలుసునా? వానికి మాలమాదుగలే శిష్యులు.

శం:- బాబాగారూ, మాలమాదుగలు శిష్యులైతే దానిలో ఏం తప్పున్నట్లు?

మా:- ఒరే. నావద్ద ఎక్కువగా కూయవద్దు. ఎక్కువప్రేలితివా నీపండ్లూడ గొడ్తాను. జాగ్రత్త.

శం:- తమకెందుకింతశ్రమ స్వామీ. నేను తమ శిష్యత్వం వదలుకొంటు న్నాను. తమకు తీర్థప్రసాదాలు భట్టీనుండీ, కటికవారివద్దనుండి తేలేక చస్తున్నా.

మా:- శూద్రునికి శూద్రగురువే కావలెనులే. వెళ్లు. మళ్లా యీ మఠంలో కాలుపెట్టితివా నీవు ప్రాణంతో పోజాలవని తెలుసుకో.

గం:- మరి నేనుకూడా సెలవు పుచ్చుకుంటూన్నాను గురూజీ.

మా:- నీకె మొచ్చిందిరా. నీవుకూడా నాకు తిరుగబడినావా? నీవు గురు ద్రోహివి.

గం:- చిత్రము. మీ యిష్టంవచ్చినట్లు కూయండి. ఇదో వెళ్లుతున్నాం. నమస్తే. రావోయ్ శంభాజీ.

శం:- గురూజీ. నమస్తే మీతీర్ధానికి నాకు ఋణంలేకుండా అయిపోయింది. మళ్లా నమస్తే.

(నిష్క్రమింతురు)

మా (స్వగతం). ఏదో ఒక రీతిగా జీవితం గడుపుకొంటూ ఉంటుంటే ఈ తుకారాంగాడు నాకెక్కడ దాపురమైనాడు. నా సుందరి పాచిక పారితే సరేసరి. లేకపోతే వానికి కాయసుద్ధి కలిగే అట్లుగా చేస్తా.



# ప్రఘట్టకము ౧౧

[ తుకారాం; ఇంటిలో; రాత్రి ౧౦ గంటల కాలమందు;

ఒంటరిగా భజన్ చేసుకొనుచుండును.]

(స్వ) ఇట్టి సమయము పరమాత్ముని ధ్యానము చాలా బాగుగా చేసుకొనుటకు యోగ్యముగా ఉండును. లోకులెంత విచారశూన్యులో కదా. ధనములలో ఉత్తమధనము, సుఖములలో శాశ్వతసుఖము, ఆనందములో సచ్చిదానందము ఇచ్చు భగవద్ధ్యానమునుమాని, బుద్బుద ప్రాయములు, క్షణికములు, నగు ప్రాపంచికవ్యవహారమిథ్యామృగతృష్ణల వెంట నంటి చెడిపోవుచున్నారు. విశ్వసేవావ్రతుడే ధన్యుడు. తదన్యుడు వ్యర్థుడు.

(తలుపు తట్టిన చప్పుడగును)

ఎవ్వరో ఇట్టి చీకటివేళలో తలుపు తట్టుచున్నారు.

( మరల చప్పుడు )

వచ్చినవారికెంతటి తొందరపని కలిగినదోయేమో? అయినా, నావంటి అష్టదరిద్రుడు, విద్యాగంధరహితుడు, నిరుపయోగుడు కూడా ఏమైనా సేవజేయనర్హుడగునా?

( మరల ధ్వని )

ఆఁ, వస్తున్నా, వస్తున్నా. తొందరెందుకు?

(తలుపు తెరచును. సుందరి ప్రవేశించును)

ఎవరుతల్లీ మీరు. ఇట్టి సమయములో తామెందుకింతశ్రమచేసి యీ మీ పుత్రుని యింటికి వచ్చినారు? నేను తమకు జేయగలసేవయెట్టిది? సెలవియ్యండి.

సుందరి:— (స్వ) ఆఁ వచ్చిన పని తలవాకిటనే చెడిపోయినట్లుంది. ఎత్తుకొంటూనే అపశకునం! ఈ మహానుభావుని తేజస్సు, శాంతము, వినయమూ, ఇవన్నీ ఇతని ప్రథమ దర్శనంలోనే నన్ను తబ్బిబ్బు చేసి

నవి. మా శృంగార విద్య, మావశీకరణ తంత్రాలూ, అన్నీ ఈ తపో ధనుని ముందట భస్మమైనట్లే. నన్ను తల్లీ అని పిలిచినారు. నేను నీ పుత్రుని అని నోటినిండా పలికినారు. ఇంతకంటే అపశకునం వేరే ఉంటుందా?

తుకా:- ఏమమ్మా—దీర్ఘాలోచనలో మునిగిపోయినారు. వచ్చిన కార్యమేమో చెప్పుటకు సంకోచించుతున్నారు. నేనేమో బీదవాన్ని, ఏమీ శక్తి లేనివాన్ని. నావలన కూడా మీకేమైనా సహాయము అవసర ముంటుందా?

సుం:- స్వామి,మీరెంతసుకుమారసుందరులో మీహృదయముకూడా అంతటి సుకుమార సుందరమైనది. అట్టి హృదయమునుండి వచ్చుభావములు సుధామధురములై రసవంతములై ఆస్వాదయోగ్యములైయున్నవి. అట్టి తమ వాక్సుధాసేకముచే నాతాపమును శాంతింపచేసికొనుటకై కామించుచుంటిని. ఈ నాటికైనా అట్టి సన్నివేశమునకు ఏకాంత మందవకాశము లభించినందులకు ఆనందించినాను.

తుకా:- తామింత విశిష్టతతో సెలవిచ్చినను నాకేమియు అర్థముకాలేదు. వచ్చిన కార్యమేమో ఇంకనూ తెలుపకనే పోతిరి.

సుం:- మనవి చేస్తున్నా తమకొరకై నెలదినాలనుండి వేచుకొనియున్నాను. ఎన్నిమారులు విచారించుకొన్ననూ తాము గ్రామంలో లేరని వార్త వచ్చెను.

తుకా:- చిత్తము. కొంతకాలమునుండి నేను మా గ్రామములో లేకుంటిని. భాస్వానాథ పర్వతప్రాంతాలలో భజన చేసుకొంటూ ఉంటిని.

సుం:- మీరు ఎల్లకాలాలలో భజనలోనే మునిగితేలితే నావంటివారి కామిత ముల తీర్చుట యెన్నడు? మీవంటివారి కటాక్షములపై మా జీవి తము లాధారపడియున్నవి.

తుకా:- నా భజనలపై మీకంత అభిమానముంటే దయచేయుండి నాతో పాటిగా పాండురంగ భజన చేయండి. రండి.

సుం:- మాభజనవేరు. మీభజనవేరు. మా "రాగము" ఒకటి. మీ రాగము ఒకటి. ఒకటి తూర్పు ఇంకొకటి పడమర!

తుకా:- అదెట్లు. మీ భజన ఎట్టిదో వినిపించండి. బాగుంటే నేనున్నూ నేర్చుకొంటాను.

సుం:- ఆఁ. అట్లనండి. అదీ వారికివచ్చే లక్షణం. వినండి మా భజన.

(శృంగార సంబంధమగుపాట పాడును)

తుకా:- (చెవులు మూసికొని) ఇదేమి భజన వినిపించినావు. ఛీ, ఛీ, ఇది తుచ్ఛగానము. ఇట్టివి నాకు సరిపడవు.

సుం:- మనోహరా, తండ్రికినీ, కుమారునికినీ. ఎక్కడనైన భేదముండదు కదా.

తుకా:- ఉండకపోవచ్చును. ఎందుకీ ప్రశ్న.

సుం:- వినండి. కామదేవుడు విష్ణుదేవుని కుమారుడుకదా. మీరు తండ్రి భజించితే నేను కుమారుని భజింపరాదా!

తుకా:- ఇది మంచి సరసమే,

సుం:- సరసమే మావృత్తి.

తుకా:- నీ పేరేమి?

సుం:- సుందరి.

తు:- సుందరీ బాయమ్మగారూ!

సుం:- అబ్బో. ఎంత పెద్దపేరు పెట్టినారునాకు. ఉత్త సుందరి అంటే చాలునండీ.

తు:- ఏమిటీ. అట్లంటున్నారు. మీ భర్తయెవరు?

సుం:- ఎవరని నిర్ణయముగా చెప్పుదునండీ.

తు:- చిత్రముగా ఉన్నదే మీ వ్యవహారమంతా.

సుం:- ఎవరిపేరు చెప్పమంటారు.
శృంగార పురుషులు నా భర్తలు!

తు:- తాము భోగపుసానులా ఏమి?

సుం:- చిత్తము. తాము సూక్ష్మగ్రాహులనుకొంటిని. ఇంతమాత్రం గ్రహించే దానికింతసేపు కావలసివచ్చిందే.

తు:- శాంతం పాపం! ప్రశాంతం మహాపాపం! అమ్మా ఈ వృత్తిని వదలు కొనుటకు నిశ్చయించుకొని వచ్చినారని గ్రహింతునా.

సు:- లేదండీ. నా వృత్తిని బాగా సాగించే దానికే తమ సన్నిధానమునకు స్వయంగా వచ్చియున్నాను. మంచిమంచి దొరలు, దొంగస్వాములు,

సాహుకారుల యువకులు, నా యింటిచుట్టూ ప్రదక్షిణించేస్తూ ఉందురు. నేను మీ యింటికే అభిమానమంతా వదలి కామమైనం కూడా అభిలషించకుండా వచ్చి మిమ్ము ఆశ్రయించినాను. అను గ్రహించండి.

తు:- అయ్యో పాపం. తమకెంత శ్రమకలిగినది. మీకు కావలసినట్లైతే విరక్తి మార్గము చూపించగలను. అంతకు మించి నేనేమియు చేయ జాలను. వ్యభిచారము పంచమహాపాతకములలో చేరినదని నేను భావించేవాన్ని.

సుం:- స్త్రీలు తమంతకు తామే పురుషులవద్దకువస్తే వారు మరీ విజృం భించి నిక్కి నీల్గుతారు. ఏమండీ తుకారాంగారు, మీరెంత చిత్త వారమా మీ దృష్టికి. ధర్మశాస్త్ర ప్రకారం రాజులు, పండితులు, ఆచార్యులు, దీక్షితులు, అందరూ యజ్ఞయాగాదులుచేసి ఏం ఫలం అనుభవించుతారు? స్వర్గలోకమునకేగినవెంట రంభా మేనకా తిలోత్తమాది దివ్యవారకాంతాసక్తులై వారివద్ద తమకామతంత్ర పరిజ్ఞానమంతయు ప్రకటింతురుకదా.

ధారిణిలోన మానవులు, తాపసవృత్తిఁ జరించి, జప్యముల్
వారక చేసిచేసి, యుపవాసములుండి, బహువ్రతంబులన్
గోరిక నాచరించి, తుదకున్, త్రిదివస్థితిలోఁ దిలోత్తమాదిశృం
గారవిలాసినీరతులఁ గాంతురుగాదె, మనోహరాంగనా!

తు:- అమ్మా, ఇవంతా పరలోకవార్తలు. ఇహలోకములో వ్యభిచారము చాలా నింద్యము, దీనివలన మానము, యశము, శరీరము, వంశము, గుణము, అన్నీ నాశనమగును. వేశ్యల సాంగత్యము చేయువారేకాక వేశ్యలుకూడా చెడిపోవుచున్నారు.

సుం:- ఏమండీ అట్లాసెలవిస్తారు మీరు. వేశ్యాసాంగత్యము చేసినలీలా శుకుడు ఉద్ధరింపబడలేదా? మల్హణుడు వేశ్యను వెంటనుంచుకొని శివ స్తోత్రముచేసి తానూ తరించెను. వేశ్యనుగూడా తరింపచేసెను. దానికే మంటారు.

తు:- వారికా వ్యసనమే లేకుంటే ఇంకా తొందరగా తరించేవారు.

సుం:- మరి పూర్వకాలములో ఋషులు, భక్తులు, సార్వభౌములు, పండితులు, మున్నగు వారు సర్వదా వేశ్యా విలాసినీ శృంగార రసప్రవాహాలలో మున్కలు కొట్టుచూ బ్రహ్మానందమును అనుభవించిరి.

భోగినీకాంతలఁ బొందెనేకాని నీ
వలె ఋశ్యశృంగుండు వలికెనొక్క
మేనకాంగనను గామించెనేకాని గా
ధేయుండు నీవలెఁ దిట్టె నొక్క;
వేశ్యారతినిఁ జొక్కె విప్రనారాయణ
భక్తుండు నీవలెఁ బలికెనొక్క;
ఊర్వశినిఁ బురూరవోర్వీశుడుంగనె
నెపుడేని నీవలె నేవపడెనె;

వారలందఱి మహిమలు వాసెనొక్క;
వారికానాఁడు చెప్పెడి వారులేరె?
వారికన్నను మించినవారు కలరె?
ఏల యీశుష్క వాదంబు లేమిఫలము?

తుకా:- మీరు విదుషీమణులుగా కానవస్తున్నారు. ఈ పాండిత్యమునే సద్వినియోగముచేసిన తాము తరించుటలో సందేహముండదు.

సుం:- నా పాండిత్యమంతయూ మీపైననే ప్రయోగించి కృతకృత్యురాలను గాగోరినాను.

తుకా:- అది వ్యర్థ ప్రయత్నము. నేను ఏకపత్నీవ్రతుడను. పైగా నాకు కామేచ్ఛ కించిత్తుకూడా లేదు. భగవద్ధ్యానరతుడనైన నాకు మత్త విలాసినీ శృంగారలీలానుసక్తత లేదు. ముమ్మాటికినీ లేదని గట్టిగా నమ్ముము.

గంగాభవానీతరంగ మజ్జనకాంక్షి
మునుఁగఁగాంక్షించునే ముఱికిగుంట
మరకతమాణిక్యమహితుఁడౌమనుజుండు
కోరునే యార్జింప గులకరాల;
ద్రాక్షారసాస్వాదతత్పరుఁ డగువాఁడు
త్రాగంగఁ గోరునే రాగిగటక;
రమణీయసౌధాంతరాళనిత్యవిహారి
తూఱంగఁ గోరునే పూరిగుడిసె

సంతత శ్రీపతి ధ్యాన సంప్రమోద
పూరితాంతరంగుండైనపూరుషుండు
తుచ్ఛభోగంబులందు సంతుష్టి గనునె?
చాన! మాను నీదుర్వ్యవసాయచింత

అమ్మా ! నీ దుర్వాంఛలను, దుర్వృత్తిని, ఇకనైనా వదలుకొనుము. ధన మార్జించుటకు పవిత్రమైన మార్గాలు నీకు కానరాకనే పోయెనా? ఇంతటి పట్టింపుతో, పాండిత్య ప్రకర్షతో నీచ కార్యమును నీవు సాధించుచున్నావు కదా. ఇందు శతాంశము మాత్రమే భక్తిమార్గ మందు వినియోగించినచో నీవు తరింతువని మరొకమారు చెప్పు చున్నాను. అటుపై నీ యిష్టము,

సుం:- మహాత్మా, నేనోడినాను. మీరే గెలిచినారు. ఈ నాటి మన యిద్దరి సంఘటనము మనకిద్దరికినీ పరీక్షా విధానముగా పరిణమించింది.

తు:- మీకు చిన్నప్పటినుండియు కలిగినబోధ, జరిగిన సంస్కారము మీరు తటాలున వదలుకొనజాలరని నేనెరుగుదును. మీలో విజ్ఞాన వికాస మును జూచి మిమ్ము సంస్కరించితే అదొక మహోపకార కార్యమై యుండునని నేనింత పూనికతో ఓపికతో మనవి చేసుకొన్నాను.

సుం:- మీయట్టి నిస్సంగుల ఉపదేశములు నావంటి పతితలకు లభించుట కష్టము. మీ దివ్యతేజస్సువలననో, మీ నిష్కళంకవర్తనమూలము ననో, నాలో గొప్ప భావపరివర్తనము కలుగుచున్నది.

తుకా:- నేను ధన్యుడనైనాను. మీరు తొందరపడవలసిన అవసరములేదు. బాగా ఆలోచించుకొనుడు. ఆలోచించుకొని మీ విముక్తి మార్గమును చూచుకొనుడు.

సుం:- మీ పాదసేవకు నాకనుజ్ఞ ఇయ్యవలెనని ప్రార్థన.

తుకా:- మీకు నిజముగా నామాటలందు భక్తివిశ్వాసములుంటే అనుదినము విఠోబా దేవాలయమునకురండు. అచ్చట నాతోగూడ భజించుడు.

సుం:- చిత్తము అట్లే చేస్తాను.

[ ప్రవేశము జిజీబాయి ]

జిజీ:- ఒసే, దయ్యమా, ఎన్నికొంపలనో కూల్చి ఎందరి ధనమానాలనో నీ పొట్టబెట్టుకొని అంతటితో తృప్తిపడలేక ఇక్కడికిగూడా వెంచేసినావా? నీ మాటలన్నీ తెరచాటునుండి విన్నానులే. ఎంతటి మాయలాడి ముండవే, ఏమి నీవేషమూ, నీమాటలూ, నీపాటలూ, నీకులుకులూ, ఒసే రంకుముండా, అన్నిటికీ ఒకటే చికిత్స, నీకు చీపురుకట్టతో నెత్తిమెంట్రుకలు ఊడెవరకు శుద్ధిచేస్తే బుద్ధివస్తుంది.

సుం:- స్వామీ. ఈమె ఎవ్వరు. నాకు పోటిగా వచ్చినట్లున్నదే !

తు:- ఈమె నా భార్య జిజీ.

జిజీ:- ఒసే, భోగముదానా ! ఎక్కువ పేలితివా ఇదో నీకు దేహశుద్ధి ఇప్పుడే చేస్తున్నాను చూడు (కట్టతీసుకొని మీదికి వెళ్ళును)

సుం:- మహాత్మా ! రక్షించండి. రక్షించండి.

తు:- జిజీ, ఇదేమిటి. నీయుగ్ర భైరవీతాండవలీల. వద్దు వద్దు. పరులను అందులో స్త్రీలను హింసింపగూడదు.

జిజీ:- ఈ రంకుముండతో ఇంతసేపా ముచ్చటించేది. ఇల్లంతా మైల పడింది. శుద్ధి చేయించవలసిందే.

సుం:- తల్లి! మీరు నన్ను తిట్టుటకునూ. బాగా మర్దించి బుద్ధి చెప్పుట కున్నూ అధికారము కలవారు. నాకు చిన్నప్పటినుండీ మంచిబుద్ధి చెప్పిన వారేలేరు. ఈ నాటికి నాకు గ్రహచారం పరిపక్వమైనది. ఎవరినైతే విటునిగా చేసుకొనదలచి వస్తినో వారు నాకిప్పుడు తండ్రి వంటి వారైనారు. మీ పాదాలంటి చెప్పుచున్నాను. ఈ గడియతో నేను నాపూర్వ వృత్తిని వదలుకొన్నాను. ఇక మీరే నాకు తల్లి దండ్రులు. మీరు చెప్పినట్లా వర్తించుకొంటాను.

తు:- జిజీ చూచినావా. ఎంతలో ఎంత మార్పైనది. ఇదంతా పరమాత్ముని లీలా నిదర్శనము.

జిజీ:- టక్కులాడి మాటలకు మీరు మోసపోయ్యేరు సుమా.

సుం:- లేదు తల్లీ. నన్ను నమ్మండి.

తు:- సుందరీబాయీ, ఇకపో నీకు నిజమైనభక్తి ఉంటే దేవాలయములో వచ్చి భజనలో చేరియుండుము.

సుం:- చిత్తము. గురుదేవా. సెలవు. అమ్మా. మీరున్నూ సెలవియ్యండి.



# ప్రఘట్టకము ౧౨

## మాన్వాజీమఠము ముందు—తుకారాం

(స్వ) ఇది సంత్ మాన్వాజీబాబా మహారాజుగారి మఠము. బాబాగారి పేరును ఈమధ్య చాలా సార్లు విన్నాను. వారిదర్శనము చేసుకొని వారి సేవచేసి వారి పవిత్రముఖకమలమునందలి విజ్ఞానసుధారస ధారాసేకముచే నాపాతకముల ప్రక్షాళనము కావించుకొని ధన్యుడనయ్యెదను. (కాలికి ముల్లు గ్రుచ్చుకొనును) శ్రీహరీ, ఎంతబాధ. ఎవ్వరో ఈమఠము ముంగిలి భాగమందు ముండ్లను వేసియున్నారు. నావంటి కర్కశకాయుడనే ఇంతబాధ కలిగితే భక్తజనమృదుపాదకమలముల కెంతబాధకలుగునో పాపం. భక్తులు పరమాత్మని ముద్దుబిడ్డలు. వారు కటకటపడిన దేవుడు కూడా సంకటపడును. కావున ముందు ఈ ముండ్లనన్నింటిని ఏరివేయుదును. (ఏరుచుండును)

మాన్వాజీ (ప్రవేశించి స్వగతముగా) —వెదుకబోయిన తీగ కాళ్లలో తగుల్కొన్నట్లైంది. వేటాడదలచిన మృగము స్వయముగా ఎదురుగావచ్చినట్లైంది. ఈవైష్ణవ భక్తునికి మంచి పంచసంస్కారముద్రలు గుర్తుండే అట్లు అంటించిపంపించితే ఇకవీనికున్నయుక్తులన్నీ మాయమైపోవును. ఈదొంగసక్క నేర్చినజిత్తులనన్నింటిని ఒకేసారి వదలించి వేస్తాను. (ప్రకాశముగా) ఓరేదొంగకుక్కా! ఇక్కడెందుకు పారాడుతున్నావురా.

తుకా:- అయ్యా, ఇక్కడ ఎవ్వరో ముండ్లను నిండుగా వేసిపోయియున్నారు. ఈ మఠానికి వచ్చేభక్తులకు బాధకలుగుతుందని వీటినన్నింటిని ఏరుతున్నా.

మా:- కంటకాపరమా నీకు. కొవ్వెక్కి కండ్లకు పొరలువచ్చినవా. ఇదెవ్వరి మఠమనుకొన్నావునీవు.

తుకా:- ఎవ్వరిదైతేనేమి స్వామీ, ముండ్లనేరితేతప్పా?

మా:- ఎవడవురానీవు. ఇంత తలబిరుసుగా మాట్లాడుతావు.

తుకా:- ఈ దాసుని తుకారాం అని అంటారు మహాత్మా. ఎప్పుడున్నూ ఎవరికిన్నీ ఎదురుతిరిగి మాట్లాడనండీనేను.

మా:- నీవేనా తుకారాం. ఆఁ విన్నాను నీ సంగతంతా. నీవు చండాలుడవు. భ్రష్టుడవు. ఈ మతాన్ని కూడా మాలమాదుగలలో కలిపే దానికి వచ్చినావా?

తుకా:- చండాలుడు కూడా మానవుడే. అతనిలో అహింసాసత్యశౌచాది గుణాలుంటే పూజ్యుడౌతాడు.

మా:- మాలమాదిగలను మెచ్చుకొంటావు కనుకనే నీకు మాలభక్తులే దొరికినారు. నీ శిష్యుడైన విఠోబా నాకిదివరకే దర్శనమిచ్చిపోయి నాడులే.

తుకా:- స్వామీ! మీరెవ్వరో విచారించవచ్చునా?

మా:- అబ్బా! ఏమివినయం, ఏమిఅభినయం. నటనఅంటే నీవద్దనే నేర్చుకోవలెను. ఎంతటిదద్దమ్మవురానీవు. శ్రీ ఛత్రపతి శివాజీ మహారాజు గారు కూడా ఈ మాస్వాజీబాబాను బాగాఎరుగుదురు. నీవు ఈ ఊరి లోనే ఉండి మమ్ములను గుర్తించనే గుర్తించవుగా!

తుకా:- నిజమే. అపరాదాన్ని క్షమింప వేడుచున్నాను.

మా:- నీవు క్షమాపణకు అర్హుడవుకావు. నీవు నాకు చాలా అపకారము చేసినావు. ఒరే, మూర్ఖా, శూద్రాధమా! నీవేమో మహాత్ముడవట! వర ప్రసాదలబ్ధకవితాధురంధురడవట. సర్వసంగ పరిత్యాగివట. మహా యోగివట!! ఎన్నిబిరుదులూ. ఏమి ఆడంబరము.? కపటవేషధారివై, మేకవన్నెపులివై అమాయకులను, మూర్ఖపుమూకను జతచేసుకొని వితలోన్మాదమిషచే చిందులుత్రొక్కి వారికొంగులోనికానుపీసముల నపహరించి పొట్టపోసుకొనిన నీచరిత్ర అంతా నాకు తెలియదను కొన్నావా?

తుకా:- స్వామీ, ఇందుకొరకా మీరు నాపై ఆగ్రహమూని యున్నారు. మీకెవ్వరో నాపైనిందలుమోపి అబద్ధప్రచారము చేసినారు. నాకు శిష్యులు లేరు, ద్రవ్యకాంక్షకూడా లేదు.

మా:- విఠోబా మహార్ నీ శిష్యుడుకాడా? నా శిష్యులుగా ఉండిన గంగాధరుడు, శంభాజీ, నీశిష్యులు కాలేదా? ఇంతలోనే ఎన్ని అబద్ధాలాడి నావురానీవు. జనుల మోసగించి తిరిపమెత్తి చెడబలిసి కారులుప్రేలుతున్నావా.

తుకా:- అయ్యో, తాము సెలవిచ్చినది యథార్థముకాదు.

జనులను బీడించుచుఁ దిరి
సిన కూడుదినంగనేర, శ్రీపతికరుణా
ఘనులగు మీబోఁటులచే
వనలంబొందుచు శ్రమించి బ్రదుకుదుస్వామి.

ధనహీనుడనయ్యు పరాధీనదీతాదీనుడనుగానని మనివి చేసుకొనుచున్నాను.

మా:- ఒరే, చండాలా, నీవు భ్రష్టుడవైనావు. నీవు నా మఠాన్ని మైలపరచి నావు. పైగా పెద్ద చిన్న తారతమ్యం లేకుండా నాయెదుట మెరుగు చున్నావా? దానికి తగిన ప్రాయశ్చిత్తమిదే ఇప్పుడే కావించు చున్నాను (ముండ్లకట్టెతో వీపుపైమోదును)

తుకా:- హా! శ్రీహరీ!

(మాస్వాజీ మరల మోదును)

తుకా:- హా! పాండురంగా!

(మరల కొట్టును)

తుకా:- స్వామీ! శాంతింపుడు, శాంతింపుడు.

కోపభరమున హింసింపఁగోరితేనిఁ,
దాపమొందను సుంతైన ధన్యచరిత!
పరమమూర్ఖతఁ బలికిన వాక్కువలన
నిందయయ్యెనో మీకని కుందువాఁడ.

నేను తెలివిలేనివాన్ని. తెలియక మీకపచారకరముకలుగునట్లుగా ఏమైన మాట్లాడిఉంటే అట్టి అపరాధాన్ని క్షమించవలెనని ప్రార్థించుచున్నాను.

మా:- ఈ నక్కవినయాలింక కట్టిపెట్టు. నీవు పట్టి పిరికిపందవు. సిగ్గులేని వాడవు. నీకింకా బుద్ధివచ్చినట్లు కానరాదు. (మరల కొట్టును)

తుకా:- బాబాజీ, మీరు అగ్రహోదగ్రులై రుద్రరూపము దాల్చిన నేనొక్క క్షణమైనా ఇచ్చట నిలువగలుగుదునా? శాంతమూర్తులుగా నుండ దగిన మీవంటి మఠాధిపతులకు ఈనాడు నాగ్రహచారవశమున క్రోధము ఆవేశించినది.

మా:- వెళ్లుతావా, ఇంకా మర్దన కావలెనా?

తు:- వెళ్లుతున్నా మహాత్మా.

సకలభూతసమత్వమే స్వామికింపు,
సాంద్రకరుణాసమేతుఁడే చారుమూర్తి,
సాధురక్షణదీక్షుఁడే చక్రధరుఁడు,
అట్టి మాధవుం డొసఁగు మీకధికశాంతి.

అయ్యా, సెలవు. భజనచేసుకొనుచు వెళ్లిపోవును-(చూడుడు అనుబంధము.)
మా:- ఇంకొకమారు నాకు పోటీగా నిలువకుండా వీనికి మంచి కాయశుద్ధి. కలిగించినా. చచ్చేవరకు మరిది పోకుండా ఉంటాడులే.

(మఠములోనికి వెళ్లును,)



# ప్రఘట్టకము 13

సుందరి-తాపసివేషముతో-తులసిపేరులు, కాషాయపు చీర, ధరించి నిరాభరణయై, వ్యాకులమానసముతో.

(స్వగతము)—పాండురంగా, జగన్నాథా, నా పాపాలన్నీ మన్నింపవా? తెలియక తప్పులు చేసినాను. నా గురుదేవుడు, తుకారాం మహాత్ముడు, నాకు దివ్యబోధ చేసేవరకు నా వృత్తిలోని నైచ్యము నాకు కానరాక పోయెను. ఈ విశాల ప్రపంచములో ఎన్నో విధాల వ్యాపారములు జరుగుచున్నవి. కాని భోగము వృత్తి విచిత్రమగు వ్యాపారము. శరీరాన్ని, మానమును, గౌరవమును, వీధిలో వేలమువేసి అమ్ముకొని, రోగములను, ధనమును, అవమానమును, మరల కొనుటయేకదా వేశ్యావృత్తి. అట్టి పతితను కరుణించి ఉద్ధరించెనే ఆ మహాత్ముడు తుకారామస్వామి. వారుపదేశించిన రీతి పాండురంగని సేవను ఇకెన్నటికైనా మరచి పోగలనా? దేవా, విఠలా.

ఎంచఁగరాని మోహమున, నెందఱనో కడుమోహగించి, కామించి, ధనంబు లాగితిని, మిక్కుటమౌననురాగమున్నయట్లంచిత రీతి లోకులను నయ్యయొ! వంచన సేసితింజుమి,
సంచిత పాపముల్ గడవ నన్మతి వేఁడెద విఠ్ఠల ప్రభో !

మాస్వాజీ:- నా చక్కనిచుక్క. నా చక్కెరబొమ్మ, నా వలపులరాణి. మన్మథాధిష్ఠాన దేవత, తలచుకొన్నప్పుడే ప్రత్యక్షమైంది. (బాగా పారజూచి) ఇదేమిటి. ఇది సుందరి కానట్లుంది (కండ్లునులిమి పరికించి చూచి) ఓ, అవే! మరి ఈ వేషమేమిటి. గోసాయిలలో కలిసి పోయిందా? కథ అడ్డంగా తిరిగినట్లుందే (వెనుకనుండి వచ్చి భుజముపై చేయివేసి) సుందరీ! ఏమే! ఎన్నాళ్లయ్యెనే నిన్నుచూడక.

సుం:- దున్నపోతా, ఒరేధూర్తా, దూరముగా పో, నన్ను ముట్టేదానికి నీవర్హుడవు కావు.

మా:- అబ్బో! నడివీధిలో ఇదేమి నరసమే. నీకు ఈ తడవ కాళీమాతమీది కంకణాలిస్తాను పదా.

సుం:- దొంగలతో, లంపటులతో నాకు సంబంధము లేదు.

మా:- ఏమి ! నేను దొంగనా, నేనా? నీవు సుందరివేనా, నీవేషం, నీమాటలు అన్ని చూస్తే సందేహం కలుగుతుంది.

సుం:- నేను సుందరినే. కాని నాతో మాటలు పెంచవద్దు. నీమానం కాపాడు కొనవలెనంటే వెంటనే వెళ్లిపో.

మా:- ఎవ్వడో గొప్పవాడు నీ చంకలో పడినాడులే. నీవిప్పుడెక్కడికి పోతు న్నావు. అదైనా చెప్పు విందాము.

సుం:- మహాత్మా తుకారాంగారివద్దకు.

మా:- ఏం. వాన్నివలలో వేసుకొన్నావా? సెబాస్, అప్పుడే చెప్పలేవా నీవంతటి దానవని.

సుం:- అయన నాకు గురువైనారు. నేను నా వృత్తిని మానుకొన్నాను. విన్నావా,

మా:- అఁ. వింటున్నాను గదా. ఆ జిత్తులమారి వలలో నీవేపడినట్టున్నది. జాగ్రత్త ! వాడు అష్టదరిద్రుడు. వాన్ని ఆశ్రయించినందుకేనా యీ బికారి వేసం వేసుకొన్నావు.

సుం:- ఛీ, పాపాత్మా, తుకారామ గురుదేవుని అవేసనిగా ఎందుకు నిందించు తావురా.

(శంభాజీ ప్రవేశము)

శం:- ఏమిటమ్మా తుకారాముగారి ముచ్చట చెప్పుతున్నావు. మాస్వామీ! నమోనమః. అమ్మా, నీవు వినలేదా ఏమి, నిన్న ఈ దుర్మార్గుడు తుకారాంస్వామిని ముండ్లకట్టెలతో మోదినాడు. గురువుగారు మంచం పట్టినారు.

సుం:- హరి హరీ, ఎంతఘోరం ఎంతఘోరం. అయ్యో పాపం. (గంగాధర పంత్ ప్రవేశం)

గంగా:- ఏమోయ్ శంభాజీ. ఏమి ఇక్కడున్నావు. ఈ కటిక బాబాతో ఎందుకు మాట్లాడుతున్నావు. వీనినిచూస్తే సచేలస్నానం చేయవలెను.

మా:- ఏమిరా. చాలా పొగరు-కూతలు కూస్తున్నావు. నీకేమైనా ప్రాయ శ్చిత్తం కావలెనా.

[ వీధిలో ౫, ౬ మంది గుంపుగూడుదురు ]

అందొకడు:- ఏమండీ. ఏమిసంగతి. తగవులాడుతున్నట్టుంది.

శం:- ఈ దొంగస్వామిపేరు మాస్వాజీబాబా. వీడు నిన్న పాపం ఆ భక్త శిరోమణి అయిన మహాత్మా తుకారాము స్వామిగారిని నిష్కారణంగా కొట్టి బాధపెట్టినాడు.

గుంపులోని ఒకడు:- తుకారామస్వామినా — ఆఁ అంతటి పొగరావీనికి.

గంగా:- వీడు చండాలునికంటే నీచుడు, కల్లు సారాయి త్రాగుతాడు మాంసం తింటాడు.

సుం:- వ్యభిచారం చేస్తాడు.

శం:- పిల్లలులేని స్త్రీలకు గర్భంఅయ్యేఅట్టు చేసేమహాశక్తి వీనిలో ఉందట. వీనిబొంద.

[ మాస్వాజీ జారిపోజూచును ]

ఒకడు:- అరే పట్టురా వీన్ని. పారిపోజూచుచున్నాడు.

మా:- వీరంతా అబద్ధం చెప్పుతున్నారురా. వీరిమాటలు నమ్మవద్దు.

ఇంకొకడు:- తన్నండిరా, ఏమీచూస్తారు (పట్టుకొందురు)

మా:- వదలండి, వదలండి: సుందరీ నీవన్నా చెప్పవేవీరికి.

సుం:- అన్నలారా! మా గురువులను హింసించినవాన్ని బాగా మర్దించండి.

శం:- ఏమిచూస్తారు కానీయండి శక్తిపూజ. (మర్దింతురు)

మా:- ఒరే. చస్తానురో, వదలండిరో, మీకుపుణ్యం ఉంటుంది. (కలకలము కొట్టండి. తగిలించు, తన్ను. అను కేకలు, చప్పుడు, దెబ్బలు.)



# ప్రఘట్టకము ౧౪

తుకారాం—జిజీబాయి కాళ్లు ఒత్తుచుండును.

తుకా:- అమ్మా! ఇంకా నొప్పి తగ్గలేదు. అబ్బా! తాపం తాపం. జిజీ, నీవేమైనా కోపపడినావంటే ఇక నాకు మందు గిందు కాబట్టదు. నీకు నమ్మకము లేకున్నావంటే నీవు వెక్కిరించినను మానె, నాకు పాండురంగడే పరమౌషధము. వానిని మరిచిపోతున్నా. అందుచేతనే ఈ బాధ తగ్గకుండా ఉన్నది. మూడుదినాలైనవి కదా విఠోబాదేవాలయానికిపోక. ఎంత అపచారమైనది.

జిజీ:- స్వామీ, మీరిట్లే కలవరించుతూ ఉంటే తాపం ఎక్కువౌతుంది. ఊరక పండుకోండి. ఈదినం పూర్తిగా నయమౌతుందిలెండి. ఊరక ఇంట్లో ఉండండీ అంటే వింటారా. విశ్వసేవావ్రతమట, పరోపకారమట. దానికి ఫలితం కనిపించిందా? ఆ దుర్జాతి పిశాచి ఆ మాస్వాజీగాడు మీకీఅవస్థ తెచ్చిపెట్టినాడు.

తుకా:- తప్పు. తప్పు. పెద్దలను దూషించవద్దు. పాపం తగులుతుంది.

జిజీ:- ఇట్లనుకొంటూ ఉండేవారుకాబట్టే మీపైకి ఎవరుపడితే వారు ఎగబడి వస్తారు. మీకు అపకారం చేయనివారెవరో చూపండి.

అభ్యాగతుల భక్తి నాదరించెద నంచు
    సరకు హరించెఁ దస్కరుఁడొకండు;
ఋణముచే గౌరవమేదినవిప్రుండు
    కొనిపోయె మిగిలిన కొలఁదిధనము;
పసిఁడిపూతను బూసి బంగారునగ లని
    నమ్మించి యమ్మె ధూర్తుఁడొకండు;
చేనిలోఁ బిట్టలఁ జేరనీకు మటంచు
    నీపైన మోపెను నేరమొకఁడు
విశ్వసేవావ్రతంబును బ్రీతితోడఁ
జేయుచుండిన మీకుదుశ్శీలుఁడొకఁడు
తాపమొందించె, హింసించెఁ దనువు నొవ్వఁ,
గటకటా! మీకు సౌఖ్యంబు కలుగు టెపుడొ?

ఇక ముందైనా మీరు మీ అభిప్రాయములను మార్చుకొనండి.

తుకా:- ఎన్ని కష్టాలువచ్చినాసరే సర్వేశ్వరునికటాక్షమొక్కటే నేను కోరు నట్టిది.

కమలమిత్రునిచేఁ బాయుహిమముపగిదిఁ
గుముదమిత్రునిచే మాయుతమమురీతి
సంకటములెల్ల శీఘ్రమే నమసిపోవుఁ
గమలనేత్రుకటాక్షంబు గలిగెనేని.

సర్వకాల సర్వావస్థలందునూ భగవంతుని నమ్మినవానికి ఎన్నికష్టాలు వచ్చిననూ అవన్ని వాని గుణశీలముల పరీక్షకేకాని మరెందుకునూకావని యెరుగుము.

(బయటినుంచి ధ్వని)

గురుదేవా! దర్శనానికి సెలవా? లోపలికి రావచ్చునా?

తుకా:- జిజీ, శంభాజీగొంతువలెఉన్నది, రమ్మనుము.

జిజీ:- రావయ్యా, అందరున్నూ రావచ్చును.

శంభాజీ (ప్రవేశించి తుకారాం పాదములంటి మ్రొక్కి)
మహాత్మా, తాపము తగ్గిందా?

తుకా:- ఆఁ, తగ్గక ఏమిచేయునులే.

శం:- బయట విఠోబా కాచుకొనిఉన్నాడు. కంట నీరుపెట్టుకొని దుఃఖించుచున్నాడు, కాచుకొనిరెండుగంటలైనదట. దేవరవారికెట్లుందో తెలుసుకొని నాకు తెలుపండి స్వామీ అని పరిపరివిధాల ప్రార్థించినాడు.

తుకా:- పాపం అతడు పరిపూర్ణప్రేమమూర్తి. అతనికిన్ని నావలెనే మాస్వాజీబాబాగారిచేత దేహసంస్కారమైనది. కావున ఇద్దరముకూడా " సమానశీల వ్యసనేషుసఖ్యం " అన్నట్లు మంచిస్నేహితులమైనాము. ఓయ్, శంభాజీ, విఠోబాతమ్ముని లోపలికి పిలుచుకొనిరా.

శం:- చండాలునా? ఇంటిలోనికా?

జిజీ:- మీరేమైనాఅనండి, నా యింటిలోనికి మాలమాదుగలను రానీయను.

తుకా:- అట్లైతే, శంభాజీ, మనమే బయటికిపోయి విఠోబాను పలుకరించి వత్తముపద.

జిజీ:- మిమ్ము మంచంనుండి లేవనీయను.

తుకా:- ఇదేమిటే, నన్ను కారాగారములో నిర్బంధించి శిక్షించుచున్నావే! ఇంటిలోనికివస్తే తప్పు, బయటికిపోతే తప్పు. ఊరకుంటేతప్పు. ఏమైన పనిచేస్తే తప్పు. అన్ని తప్పులే. ఆతప్పులను విచారించే ధర్మాధికారివి శిక్షించే దండనాధికారివికూడా నీవే. నాపై కావలికాసే రక్షకభటవృత్తి చేసేదికూడా నీవేనా? బాగుంది.

శం:- మహాత్మా. మాతల్లి ప్రేమమయస్వరూపిణి. అంతా మీ మేలుకొరకే చేస్తున్నది. అయితే మీ భావం వేరు. అమ్మగారిభావం వేరు. కావున తాము సహించి యుండవలెను.

తుకా:- బాగా గుర్తుపట్టినావేయి నీవు. నేనున్నూ అదేభావనతో ఉన్నాను.

జిజీ:- ఇదిగో వినండి. నేనుపోయి విఠొబాతో అంతా నచ్చచెప్పి తృప్తిపరచి పంపించి వస్తాను. మీరు ఊరకుండండి.

శం:- ఇప్పటికి ఒప్పుకొనండీ.

తుకా:- నీ యిష్టము వచ్చినట్లు చేయిపో. (జిజీ వెళ్లును)

శం:- మహాత్మా, నిన్న జరిగిన ముచ్చట విన్నారా?

తుకా:- ఏమిటి?

శం:- మాస్వాజీ బాబాకు కాయశుద్ధి కలిగింది. నడివీధిలో పదిమంది కలిసి చావమోదినారు.

తుకా:- అయ్యో! పాపం. ఆయనకు ఎంతకష్టము కలిగిందో, ఎందుకట్లు జరిగినది.?

శం:- తమరిని అతడు హింసించినాడని మంది వినేవరకు వారికి ఉద్రేకం కలిగి అతన్ని మెత్తగా మర్దన చేసినారు.

జిజీ:- (ప్రవేశించుచూ) ఎవ్వరినయ్యా, ఎవ్వరిని మెత్తగా మర్దన చేసినది?

శం:- మాస్వాజీని తల్లీ!

జిజీ:- మాస్వాజీనే! ఎవరు? ఎందుకు? ఎప్పుడు? చెప్పవయ్యా విందాము.

శం:- తుకారాం నాయనగారిని మాస్వాజీ హింసించినాడని నేనే వీధిలో పోయ్యేవారితో చెప్పినాను. అప్పుడు మాస్వాజీ సుందరీబాయితో తగవు పెట్టుకొంటూ ఉండినాడు. అంతలోనే గంగాధరపంత్‌వచ్చి మాస్వాజీ కల్లు సారా త్రాగుతాడు మాంసం తింటాడు అని అతని చర్యలంతా

బయట పెట్టినాడు. ఇంకేముంది. అందరూ మాస్వాజీపైబడి తలా పది దెబ్బలుకొట్టి మెత్తగా మర్దించి మర్దించి వదలినారు. మళ్లా రెండు వారాలవరకు మంచం కదలి రాలేదు లేండి.

**జిజీః-** ఆహా ! ఎంతటి సువార్త. ఎంతటి సువార్త ! శంభాజీ! నీవు చల్లగా నూరేండ్లు బ్రదుకు నాయనా. ఆ గాడిదకు మంచి ప్రాయశ్చిత్తం చేయించినావు.

**తుకాః-** శంభాజీ! ఒకమాట చెప్తుతావిను. ఈ జిజీకేమో ఎన్ని చెప్పినాసరే శరీరములో జీర్ణించుకొని పోయిన బుద్ధి మారనే మారదులే. ఇదో విఠొబాను చూచినావుకదా అతన్ని మాస్వాజీ బాబాగారు కట్టెతో బాగా కొట్టియుండిరి. విఠొబా ఎదురు తిరిగెనా? చేతగాని వాడా. అతనికే కోపము వచ్చిఉంటే మాస్వాజీబాబా ఎముకలను పిండిపిండి చేసి వచ్చేవాడు. తుదకు తిట్టనైన తిట్టెనా? హరినామస్మరణముచేయుచూ వెళ్లివచ్చినాడు. గురుబోధ పట్టువడిందంటే అదీ లక్షణము. నీకున్నూ బోధచేసినాను. అహింసామాహాత్మ్యమును నిరూపించి చెప్పినానుకదా. అది పట్టుపడెనామరి? మీలో ఎవరెక్కువ నీవేచెప్పు? ఇచ్చట కులము ప్రధానమా? గుణము ప్రధానమా? వెర్రిలోకము ! మంచిమాట చెప్పేవారంతా ఈలోకాన వెర్రివారై పోయినారు.

**శంః-** (తుకారాం కాళ్లు పట్టుకొని) తప్పైంది. తెప్పైంది క్షమించండి. నిజముగా విఠొబా నాకన్న గొప్పవాడైనాడు. నాకు మాస్వాజీ గురుబోధా వాసన ఇంకా వదలలేదు.

**జిజీః-** నాయనా! శంభాజీ! నీవేమిన్నీ తప్పు చేయలేదయ్యా! వీరిట్లే అంటుంటారు. నీవింకా పదిమారులు మాస్వాజీని కొట్టివస్తే నేను నిన్ను క్షమించుతాను. పైగాదీవనలిస్తాను.

**తుకాః-** "స్త్రీబుద్ధిః ప్రళయాంతకా"! శంభాజీ ! తస్మాజ్జాగృహి ! జాగృహి !

**శంః-** చిత్తము గురుదేవా?

**తుకాః-** జిజీ. నీవు నామాట లర్థము చేసుకొనవు. అయినను నాకుతోచినంత చెప్పకుండా ఉండను. హింస రాక్షసచర్య. అహింస దేవతాధర్మము.

పరులొనర్చెడు హింసను బ్రతిఘటించి
క్రౌర్యములఁ జేయు కుజనుండె రాక్షసుండు.
హింస యొనరించువారి సహించియుండి
దీవనలనిచ్చు సుజనుండె దేవసముఁడు.

మనయోగులు, మునులు, మహర్షులు, అహింసకే అగ్రస్థాన మిచ్చి నారు.

జిజీః- మీరు చెప్పినదంతా అబద్ధమని ఎవ్వరన్నారు- మీరు చూపించిన ఈ ధర్మాలన్నీ యోగులు, మునులు, మహర్షులూ, ఆచరించేధర్మాలు. అవి మనవంటి సంసారులకు పనికిరావు.

తుకాః- నేను మొదలే అన్నానుకదా. నీకివి నెత్తికెక్కవని. శంభాజీ, ఇకపో, రేపటివరకు శ్రీహరి కటాక్షముతో నాకు నెమ్మది అయిపోవును...... ఆఁ మాటలమధ్య మరిచిపోయినా జిజీ. విఠొబాకేమి సెలవిచ్చి వచ్చినావు.

జిజీః- వానికి నచ్చజెప్పినాను. తమకు బాధ తగ్గిందని చెప్పినాను. రెండు మూడు దినాలలో దర్శనమిస్తారు పో. అన్నాను. తమ దర్శనం కాక పోయిందనీ తమకింతకష్టమువచ్చెనే అనివానిది ఒకే ఏడుపు. పాపం వాడు చాలా మంచివాడు.

తుకాః- చూచినావా, మంచి వారిని మన మేవిధముగా పశువులకన్న తక్కువగా చూస్తున్నామో. శంభాజీ! మాస్వాజీగారిపై హింసకు నీవు కారణ భూతుడవైతివికదా. అది తప్పని తెలిసినదా నీకు? అతని వద్దకు పోయి క్షమాపణ వేడుకొంటావా మరి?

జిజీ- వద్దు వద్దు. నామాటవిను.

తుకాః- నామాటనే వినవోయి నీవు.

శంః- చిత్తము. గురుదేవా ! ఇక మీ ఆజ్ఞను ఉల్లంఘించను.

తుకాః- శుభమస్తు. ఇకపో.

(శంభాజీ—తుకారాం జిజీబాయీల కాళ్లంటి మ్రొక్కి వెళ్లిపోవును.)



# ప్రఘట్టకము ౧౫

ౘ్రామపటేలు:- రామేశ్వరభట్టు పురోహితుడు.

పటేలు:- పెద్ద తలపాగా, పెద్దమీసాలు, బొంబెల అంగీ, చేతిలో కట్టె, ఎత్తైనవాడు, మెడలో నుత్తరీయము.

రామేశ్వరభట్టు:- మెడలో రుద్రాక్షలు, నొసట గంధము (బాలచంద్రాకారముగా) జలతారు శాలువ, నెత్తిన పూనా పగిడీ, ఎర్రనివాడు, ఎర్రని పట్టంచు ధోవతి, పంచాగం చంకలో.

---

రామేశ్వరభట్టు:- (తిథివార నక్షత్రయోగాదులను పంచాంగము చూచి చెప్పును)

మహారాజా ! ఈ దినం చాలా శుభకరమైనది. మీ పేరు బలం (గుణించి) ఈ దినం బాగా ఉంది. సర్వం దిగ్విజయం మహారాజా మీకు (పూలు అక్షతలు పెట్టును)

పటేలు:- (నడుమునకున్న సంచినుండి ఒక పావలా తీసి పురోహితుని చేతిలోపెట్టి) తమ ఆశీర్వచన బలం. రామేశ్వరభట్టుగారూ. ఏమి విశేషాలూ. సెలవియ్యండి.

రామే:- ఏముంది పటేలుగారూ. తాము ధర్మమూర్తులుండగా మావంటి వారికి క్షేమమే. అయితే ఒక్క సంగతి మీతో మనవి చేసుకోవలసింది కలదు. చిత్తగించవలెను.

పటేలు:- సెలవియ్యండి.

రామే:- ఇంతవరకు మేము మీ నీడలో కడుపులోని చల్లకదలకుండా చల్లగా జీవించినాము. ఇకమీద ఏమికానున్నదో యేమో?

పటేలు:- అట్లా సెలవిస్తారేమిస్వామీ? మీకేమికష్టం వచ్చింది?

రామే:- వర్ణాశ్రమాచార ధర్మాలన్నీ మంటకలుస్తున్నవి.

పటే:- అదెట్లు?

రామే:- మీరున్నూ సచ్ఛూద్రులేకదా. మీరు ఏవర్ణంవారు ఎట్లుండవలెనో ఎక్కడుండవలెనో పెద్దలనుండీ వచ్చిన మర్యాదను కాపాడుకొంటూ పాలించుతూ వచ్చినారుకదా.

పటే:- అయితే ఇప్పుడు మికేమి అపచారమైందో చెప్పండి?

రామే:- ఇదే మన దేహూ గ్రామములో తుకారాం అనే శూద్రుడున్నాడు కదా!

ప:- అవును. అతడు చాలా గొప్పభక్తుడు.

రా:- మీరే యిట్లు సెలవిస్తే ఇంకెవ్వరితో మొరపెట్టుకోవలె మీరే చెప్పండి?

ప:- అతనివల్ల మికేమి నష్టకష్టాలు కలిగినవయ్యా! వెర్రిబ్రాహ్మడా!

రా:- వాడిటీవల అభంగాలని పేరుపెట్టి వేదరహస్యాలు సర్వవర్ణాలవారికి బోధించినాడు.

ప:- మంచిపని చేసినాడు.

రా:- శూద్రులకు వేదాధికారంలేదు. అల్పజాతివారందరున్నూ మమ్ము లను అప్పుడే అగౌరవంగా చూస్తున్నారు. పైగా తుకారాంశిష్యు లెవ్వరో విన్నారా? పిఠోబాఅట. వాడు చండాలుడట. వానితోకూడా తుకారాం భజనచేస్తూ చిందులు తొక్కుతుంటాడట.

ప:- ఆc. ఆమాట నిజమైతే అదితప్పని నేనున్నూ అంటాను. అయినా నన్నేమి చేయుమంటారు.

రా:- తుకారామును శిక్షించి గ్రామంనుండి వెళ్ళగొట్టండి.

ప:- అబ్బో! అంతపనే! విచారించకుండానే!

రా:- మీయిష్టం వచ్చినవారికి ఆజ్ఞయిచ్చి విచారించుమనండి. నేరము స్థిరపడితే శిక్షించండి.

ప:- ఆc. అట్లేచేస్తాము. విచారించేదానికి ఎవ్వరిని ఏర్పాటుచేస్తాము?

రా:- మీకు తెలియదా మహారాజా! ఏదో ఆటుగవలెనని అడుగుతారు. చాలా సూక్ష్మవేత్తలుమీరు.

ప:- మీరున్నూ, జయరామస్వామిగారున్నూ చేరి మరొక పెద్దమనిషిని చేర్చుకొని ముందువారం విచారించండి. కాని ధర్మముమీద దృష్టి ఉంచి న్యాయంగా తీర్పుచేయండి. లేకుంటే అధర్మంచేసిన దుష్ఫ లితమంతా మీనెత్తిననే ఉంటుంది చూడండి.

రా:- చిత్తం చిత్తం. దైవసాక్షిగా ధర్మంగా వర్తించుకొంటాము.

ప:- సరే. మీకు అజ్ఞాపత్రమువ్రాసి తలారివెంట పంపుతాను పొండి.

రా:- దీర్ఘాయుష్యమస్తు. వంశాభివృద్ధిరస్తు. బహుపుత్ర పౌత్ర ధనధాన్య సమృద్ధిరస్తు. మహారాజా! సెలవు.

ప:- దండము స్వామీ! దండము.

# ప్రఘట్టకము ౧౬

దేహూగ్రామము—విఠలస్వామి దేవాలయము

తుకారాం-శిష్యులు, శంభాజీ, గంగాధరపంత్ సుందరి మరికొందరు.

తుకారాం భజన చేయును. [చూడుడు అనుబంధము] శిష్యులు పల్లవి అందుకొని పాడుదురు. తుకారాంచుట్టుతిరుగుతు భజనసేయుదురు. విఠొబా గుడిబయట దూరముగా ఒకమూలలో చప్పట్లు చరచుచూ భజన గీతములను అందుకొని కనులుమూసుకొని భజించుచుండును.

---

భజనానంతరము—తుకారాం—

భక్తాగ్రేసరులారా! సర్వమంగళాకారుడైన శ్రీమన్నారాయణుని మరొక్కసారి అందరున్నూ మనసార భజించండి. రండి. భక్తికొలది భజింతము.

(తాను గానము చేయును. ఇతరు లనుకరింతురు)

తుకా:- భక్తబంధులారా, మీవంటి సజ్జనుల సహవాసముచే నేను ధన్యుడ నైతిని. సత్సాంగత్యమే సర్వదా అభిలషణీయము. పదివేల మూర్ఖులతో కలిసియుండుటకన్న ఒక్క బుద్ధిమంతుని ఆశ్రయించుట శ్రేయస్కరము. వేయివ్యర్థపుమాటలు పలుకుటకన్న ఒక్క సారవంతమగు వాక్య ముచ్చరించుటమేలు. వేలకొలది భావశూన్యమగు పద్యములు వ్రాయుటకన్న ఒక్క రసవంతమగు పద్యమును రచించుటమేలు. నూరు సంవత్సరములు కామక్రోధలోభాది దుర్గుణములకు దాసుడై బ్రదికియుండుటకన్న ఒక్కదినము పవిత్రుడై పరోపకారియై జీవించుట మేలు. పదివేల ప్రతిపక్షభటుల నిర్జించుటకన్న తన పంచేంద్రియములను జయించుటే నిజమైన శూరలక్షణము. ఇంతకన్న నెక్కువగా మీకు మనవిచేయ సమర్థుడనుగాను.

విఠొబా:- గురుదేవా! మీరిప్పుడు సెలవిచ్చిన బోధలు రత్నాలరాసులు. ఒక్కొక్క అక్షరం ఒక కోటి విలువచేస్తుంది. నా యెదలో అవి నాటుకొని పోయినవి. తమ బోధను ఎన్నటికిన్నీ మరవను మహాత్మా.

తుకా:- ఓయీ! విఠొబా, ఎందుకయ్యా! అంతదూరముగా నిలిచిఉన్నావు? రా! లోపలికిరా!

వి:- మహాత్మా! నేను లోపలికివస్తే గుడి, గుడిలోనివేల్పును, దేవుని కొలిచే భక్తులు, మైలపడిపోదురు, గోడలుకూడా మైలపడును.

తుకా:- దేవునికి మైలఉంటుందా? మైలపడే దేవాలయము పవిత్రమెట్లవు తుంది? రా! భయములేదులే!

వి:- మీకు ఉండే కరుణ, ప్రేమ, ఆదరం. అందరికీ ఉంటుందా మహాత్మా? ఇతర భక్తులకు బాధ కలుగుతుంది. భక్తులకుబాధ కలిగించగూడదని తామే సెలవిచ్చినారుగా!

తుకా:- భక్తులారా! అవునా? విఠొబా దేవాలయములోనికి వచ్చుటచే మీకు బాధకలుగునా?

గంగా:- స్వామి! పెద్దలనుండి వచ్చిన ఆచారప్రకారము విఠొబా దేవాలయములోనికి రాజాలడు. అది శాస్త్ర సమ్మతముకాదు.

తుకా:- గంగాధరపంత్! చండాలురు మనవంటి వారుకారా? సాటి మానవులను నీచముగా చూచుట, నిరోధించుటకూడా ఒక విధముగు మానసిక హింసయే. పశుపక్ష్యాదులను జడపదార్థములను తాకునట్టివారు సృష్టిలో ఉత్తమమగు మానవ జన్మమునెత్తిన తోడి సోదరులను దేవుడందరికినీ ప్రసాదించిన సర్వసౌకర్యముల నుండ దూరముచేయుట ధర్మవిరుద్ధము.

గంగా:- అట్లైతే శాస్త్రాలలోని శాసనాలు తప్పంటారా మీరు.

తుకా:- ధర్మశాస్త్రాలకన్న వేదములే ముఖ్యప్రమాణములు. వేదములలో చాతుర్వర్ణ్య సృష్టియున్నదె కాని చండాల సృష్టి కానరాదు. మధ్య కాలములో అనేక సాంఘిక కారణాలచేత చండాలజాతి యేర్పడెను. అట్లేర్పడినను వారిలో గొప్పకవులు, రాజులు, భక్తులు, ఉద్భవించిరి. పురాణకాలములో ఒక సుందరమగు ఇతిహాసముకలదు. ఒక చండాలుడు అతిథిగా రంతిదేవునివద్దకు వెళ్లినప్పుడు ఆ చండాలుని భగవత్స్వరూపునిగా భావించి రంతిదేవుడు సత్కరించెను కదా. చండాలురలో ఎట్టివారుద్భవించిరో వినండి.

బాణమయూరసత్పండితప్రకరసం
కాళులౌటకు "దివాకరుఁడు" సాక్షి;
రామదాస కబీర నామదేవులతోడ
నుపమింప "చోఖమే" ళొకఁడుసాక్షి;
గౌతమ యాజ్ఞవల్క్య వసిష్ఠమునులకు
నుద్దియన "ఉలోపి" యొకఁడుసాక్షి;
సర్వ సర్వంసహా శౌనకాదులతోడ
నుచ్చరింపఁగ "నందు" డొకఁడుసాక్షి;
కవులు, భక్తులు. మునిముఖ్యు లవనిపతులు,
మున్నుగా గలమహితులఁ గన్నయట్టి
వంశమును నంటరాదని పలుకు జనులు
దేవ విద్రోహకులుగాక దేవహితులె?

శంభాజీః- మహాత్మా! ఎవరో ఒకరిద్దరు మంచివారు చండాలజాతిలో పుట్టితే మనం మన పెద్దల ఆచారాన్ని వదలు కోవలసిందేనా? తెలియక అడుగుతున్నా చిత్తగించవలెను.

తుకాః- ప్రతిజాతిలోను గొప్పవారు కొలది మందియే ఉందురు. ఇక్ష్వాకు యాదవ వంశములలోనే గొప్పవారు చాలకొద్ది మందికదా! అయి ననూ చండాల కులములో చాలామంది వెలసినారు. ఒక్కొక్క కాల మందొక్కొక్క మహనీ యుడెట్టి పూజ్యతను పొందెనో వినండి.

అఖిలవైష్ణవజనాభ్యర్చితుండై "తిరు
ప్పాణాళ్వ" రొకనాఁడు భవ్యుఁడయ్యె;
జ్ఞానప్రపూర్ణుఁడై సర్వసంపూజ్యుఁడై
"నందనా" రొకనాఁడు పొందె ముక్తి;
ఆదిశంకరునంత యాచార్యు నోడించెఁ
జండాలుఁ డొకనాఁడు చర్చచేసి;
ఆ హరిశ్చంద్ర మహారాజుఁ బనిగొనె
"వీరబా" హొకనాఁడు నేరమనక;

శృంఖలాబద్ధసంపుంపుకేమ మరసి,
దాస్యమోచన మొనరింపఁ దలఁచుమిర
లట్టిధన్యులసంతతి నడఁచివైచు
టెంతశూరత్వమో మదినెంచుఁడయ్య!

నా దృష్టిలో చండాలనాములందరును హరిజనులే సుమా!

శంభాజీ:- దేవాలయాలు పవిత్రమైనవి. అందు అంటరానివాడు రాగూడదని అంటారుకదా. దానికేమందురు తాము.

తుకా:- మనకుండే లోపాలను దేవునికిని, దేవుడుండు ఆలయములకును అంటగట్టగూడదు. దేవుడు కన్నతల్లివంటివాడు. అతనికి పక్షపాతము లేదు. కన్నసంతానములో కొందరుమంచివారు కొందరుచెడ్డవారును ఉందురు. కాని తల్లికందరునూ ఒకటే:-

> అన్నదమ్ములలోన నన్యోన్యవైర
> భావములు దుస్పృహంబులై ప్రబలుఁగాత,
> కన్నతల్లికి మూర్ఖుఁడు, ఘనమునీషి,
> లేకివాఁడును, శుద్ధుఁడు, లెక్కకొకటె.

వి:- స్వాములారా! మీరింతసేపు నన్నుగూర్చియేకదా వాదించినారు. నేను మీ పాదసేవకున్ని. నాచిన్నబుద్ధికితోచిన ఒకటి రెండుమాటలు మన విచేసుకోవచ్చునా? కోపంరాదంటే ఎన్నితప్పులున్నా ఈ దానుని క్షమించుతామంటే మనివి చేసుకుంటాను.

తుకా:- మంచిమాటలను పిల్లలుచెప్పినను వినవలెను. దేవుని సన్నిధిలో నీకు సత్యమనితోచిన భావాలను నిర్భయముగా వెల్లడిచేయుము.

వి:- అందరూచిత్తగించవలె. నాపూర్వకర్మవశాన నేను చండాలకులములో పుట్టినాను, ఈజన్మలో సత్కార్మలుచేసి పురుషార్థ ప్రయత్నాలవల్ల వృద్ధికి రాదలచినాను. సత్పురుషులసాంగత్యమే దీనికి మూలాధారము. మరి మీకంటె పెద్దలు నాకెవ్వరున్నారు చూపించండి. మీరే నన్ను దూరంచేసితే ఇకనాకుదిక్కెవ్వరో సెలవియ్యండి. నాకు చదువు రాదు. మూఢభక్తిమాత్రం మెండుగా ఉన్నది. మీవంటి పెద్దలు చెప్పగా విన్నానుకదా. పూర్వం శ్రీరాములవారి గురువులైన వసిష్ఠ ముని మా యింటి ఆడుపడుచైన అరుంధతిని పెండ్లాడెనట. ఇప్పటి కిని ఆమె దర్శనంకానిది ఎవరిపెండ్లికూడా పూర్తికాదంటారు. పూర్వ మొకప్పుడు విశ్వామిత్రుడు తనకొడుకులను చండాలులగునట్లు శపించెనట. ఆయన సంతానమేకదా ఈ దేశములో నగానికిపైగా నిండి ఉన్నది. విశ్వామిత్రుడు వసిష్ఠుని కుమారులనుగూడా చండాలులగు నట్లు శపించెనట. ఆయన సంతానమేకదా మేమంతా.

మీకెందుకండీఇంతటిదురభిమానము. దేవుడుమిమ్మొకవిధంగా మమ్మొకవిధంగా పుట్టించెనా? మాలోమాత్రమే నీచులున్నారా? ఇతర

కులాలలోలేరా? భారతం కథలు వింటుంటాముకదా. అందు ఏ వంశమువారు పవిత్రులో, కాస్త చూపించి నిరూపించండి? మీరు మమ్ము దూరంచేస్తే మేము చెడేదేకాకుండా మీరున్నూ చెడిపోతారు. నాకు తోచిన మాటలను దాచుకోకుండా మనవిచేసుకొన్నాను. మీ యిష్టంలేనిది దేవాలయములోనికిరాను. మా గురుమహాత్ములు తుకా రాం స్వామిగారి పుణ్యాన అక్కడి విఠోబాను నా ఎదలో నిలువు కొన్నాను. కావలిస్తే ఈ గుండెను చీల్చి చూడండి. నిర్భయంగా మీ కాళ్లవద్ద ప్రాణాలువదిలేవానికి సిద్ధముగా ఉన్నాను. ఈదాసుని తప్పు లను కనికరించి క్షమించండి.

తుకా:- ఓయీ, నీవు చక్కగా మాట్లాడినావు. నీవన్నట్లుగా సంఘముపై బలవంతమును ప్రయోగింపరాదు. వీరికందరికిన్నీ దయవచ్చిననాడే దేవాలయములోనికి వత్తువులే. అంతవరకు నీ అంతరంగములోనే పాండురంగని నిలుపుకొని ఏకలవ్యునికున్నట్టిభక్తితో స్వామిని కొలిచి నట్లైతే నీకు ముక్తి తప్పకుండా దొరుకుతుంది.

( ప్రవేశము — తలవరి )

తల:- అయ్యా! తుకారాంగారూ! ఊరిపురోహితులు రామేశ్వరభట్టుగారు తమరిని రేపుప్రొద్దున చావిడివద్దకు రమ్మన్నారు.

తుకా:- ఎందుకూ?

తల:- ఏమోనండీ, అదంతా మాకు చెప్పుతారా. చెప్పినంత చేసేవాణ్ణి; నీ బానిసను, తలారిని.

తుకా:- సరే అట్లేవత్తునని చెప్పుపో.

(నిష్క్రమించును)

సోదరులారా! కాలమెప్పటికినీ ఒక్కరీతిగా ఉండదు. ఏసమయ ములో ఏమి సంభవించునో ఎవరికెరుక? మరల మనమందరము ఈవిధ ముగా సత్కాలక్షేపము చేసేదెన్నడోయేమో? ఒక్కమారు అందరమున్నూ భక్తితో భజనచేసిపోదము. రండి కీర్తన పాడుదము.

( తుకారాం గానముచేయును. భక్తులు అందుకొని పాడుదురు. )

# ప్రఘట్టకము ౧౭

[రామేశ్వరభట్టు, జయరామస్వామి, మరొక బ్రాహ్మణుడు ధర్మాసనములో- గుండుదిండ్లు. తెల్లనిబట్ట పరుపు తివాసీలమీద ఉంటారు.]

---

రామే:— జయరామస్వామీ! తుకారాం వస్తాడాలేదా? ఏమనుకొంటారు.

జయ:- మనము ధర్మాసనంలో కూర్చొని విచారణ చేస్తామని ఎవ్వరైనా అతనికి చెవిలో ఊది ఉంటారు.

బ్రాహ్మ:- అట్లైతే రాకుండా ఎగవేస్తాడనుకొంటా.

రామే:— వచ్చినాసరే, రాకున్నాసరే. రాకపోతేమాత్రం ఏమయితాయా. అతడు దోషియని పరోక్షంగా నిర్ణయించి వేస్తాము.

(తుకారాం ప్రవేశము)

వస్తాడో రాడో అనే వివాదానికి తావులేకుండా తుకారాం రానే వచ్చెను లెండి.

తుకా:- దేవతాస్వరూపులకు, బ్రాహ్మణోత్తములకు ఈ దాసుడు సాష్టాంగ దండ ప్రణామము చేయుచున్నాడు (అట్లే చేయును.)

రామే:- తుకారాం! శ్రీమంతు పటేలుగారు మాకు పంపిన ఆజ్ఞాపత్రాన్ని నీకు మొదలే వినిపిస్తున్నాను. విను.

"శ్రీమద్వేదమూర్తులైన యజన, యాజన,
అధ్యయన, అధ్యాపక, దాన, ప్రతిగ్రహ,
షట్కర్మనిరతులైన, వేదవేదాంగనిష్ణాతులైన
షట్ఛాస్త్ర ప్రతిపాదకులైన బ్రహ్మశ్రీ

రామేశ్వరభట్టు పురోహితుల వారికిని, బ్రహ్మశ్రీ జయరామస్వామి అయ్యవారికిని, ఈ ఆజ్ఞా పత్రమూలంగా సెలవిచ్చుట యేమనగా. మీరిద్దరున్నూ మరొక బ్రాహ్మణ మహాశయుని చేర్చుకొని ఈగ్రామంలో ఉండే తుకారాం అను నాతడు ధర్మవిరుద్ధముగా వర్ణాశ్రమాచార విరుద్ధముగా వర్తించుకొనుచు అపచారము చేసినాడను నేరములు ధర్మాసనములో విచారించి నేరము మీ సమష్టి అభిప్రాయంలో స్థిర పడినట్లైతే మీకున్యాయముగా తోచినవిధంగా శిక్షింపగలరు—పటేలు."

విన్నావయ్యా, శ్రీమంతు పటేలుగారి ఆజ్ఞను.

తుకా:- చిత్తం. విన్నాను. నేను ధర్మవిరుద్ధ చర్యలను చేసినానని మీరు. విచారించి నిరూపించినట్లైతే మీ యిష్టం వచ్చినట్టు శిక్షించండి. సంతోషముగా శిక్షకు బద్ధుడనైయుందును.

రామే:- ఏమండీ, విచారణను ప్రారంభింతమా.

జయ, బ్రాహ్మ:- చిత్తం. శ్రీ గణాధిపతయేనమః. అరంభించండి.

రామే:- (తుకారాంతో) నీపేరేమి?

తుకా:- తుకారాం.

రామే:- నీదేం కులం?

తుకా:- శూద్రకులంలో జన్మమెత్తినా.

రామే:- ఏ వృత్తి?

తుకా:- విశ్వసేవావ్రతం.

జయ:- నీవు వర్తకుడవు కావా?

తుకా:- ఆ వృత్తిని వదలుకొని చాలా కాలమైనది.

రామే:- మరి విశ్వసేవావ్రతమేమి వృత్తి?

తుకా:- సమస్త ప్రాణులనిష్కామ సేవయే విశ్వసేవావ్రతం.

రామే:- సర్వవర్ణసర్వప్రాణిసేవ నీచముకాదా?

తుకా:- ఇతరులను యాచింపకుండా, మోసగింపకుండా, హింసింపకుండా సత్యమునే ఆశ్రయించి చేయు సేవఎట్టిదైనను పరమోత్తమం.

రామే:- ఊఁ, కానిమ్ము. తుకారాం. నీపై ఆరోపింపబడిన నేరము విను.

"నీవు శూద్రకుల సంజాతుడవయ్యు నీవు వినరాని పలుకరాని పవిత్ర వేదములను, అభంగములనుగా రచించి శూద్రాదుల కందరికిని బోధ చేసినావు. నీవు చండాలాదులను శిష్యులనుగా చేసుకొన్నావు. వారిని స్పృశించి వర్ణసంకరము చేసినావు. మాస్వాజీబాబాయను బ్రాహ్మణ మత స్వామిని నీశిష్యులచే కొట్టించినావు. నీకుభోగముదాని సహవాసము కలదు." ఇవి నీపై మోపబడిన నేరములు. వీటి నొప్పుకొనెదవా లేదా?

తుకా:- తాముసెలవిచ్చిన వాటిలో కొన్ని యసత్యములు, కొన్ని యథార్థములు కలవు. నాకు చండాల శిష్యుడుండుట నిజము. జాతిచండాలురు చండాలురుకారు. వారు హరిజనులు † కర్మ చండాలురే నిజమగు చండాలురు. ఒక భోగముస్త్రీయు నాశిష్యురాలే. ఆమెను సంస్కరించి వృత్తిని వదలించి యుద్ధరించినాను. ఆమె నాకు బిడ్డ వంటిది. ఇక వేదములనుగురించి నా మనవి యేమన అవి విశ్వమున కంతటికిని సంక్రమించిన పెద్దలయాస్తి. "కృణ్వంతో విశ్వమార్యం" అని వేదములాదేశించియుండ శూద్రులకు వేదాధికారము లేదనుట అపచారము. ఈ విచారణ సాగుటకుముందు సభవారి నొక ప్రశ్న మడుగుతున్నాను. స్వాములారా! ఇది బ్రహ్మసభకదా! ఇట్టి పంచాయితీ సభలో ధర్మనిర్ణయప్రకారము విచారణ జరుగునాయని తెలుసుకొనదలచినాను.

రామే:- ఇది బ్రహ్మ సభయే. ఇదే పంచాయతీసభ. ఇందు ధర్మశాస్త్ర ప్రకారమే విచారణజరుగును. అందేమియు సందేహములేదు. తెలిసినదా?

తుకా:- చిత్తము. అయితే నాపై నిందారోపణలు చేయువారెవరు?

---

† కడజాతివారికి "హరిజన" నామము మొదట ఇచ్చినవారు తుకారామ స్వామిగారే.

రామే:- మేమే చేస్తున్నాము.

తుకా:- అట్లైతే తాము విచారణకర్తలుగా నుండవాలరు.

రామే:. ఎందుకు?

తుకా:- తాము వాదిస్థానమందుడవలెను. నేను ప్రతివాదిస్థానమందు న్నాను. అటుకాక తామే నిందారోపకులగువాదులును తామే విచారణచేయు అధికారులును నగుట ధర్మవిరుద్ధము.

రామే:- పటేలుగారంపిన ఆరోపణములను నీకు వినిపించినాము. దానికేమి సమాధానము.

తుకా:- అట్లైతే పటేలు వాఙ్మూలము ప్రమాణయుక్తముగా మొదలు సభలో వెల్లడికావలెనుకదా!

రామే:- ఇవన్నియు కుతర్కములు. నీవు మేమడుగు ప్రశ్నలకు మొదలు సమాధానమిమ్ము.

తుకా:- అట్లేకానియ్యండి. తమ చిత్తమువచ్చినట్లు చేయండి.

జయ:- నీవు చండాలుని స్పృశించినావు కదా. అది తప్పుకాదా?

తుకా:- నా దృష్టిలో అది తప్పుకాదు.

జయ:- అదెట్లు?

తుకా:- వారును మానవులే. ఇతరజాతులలో నుద్భవించిన రీతిగా చండాలులలందును గొప్పవారు వెలసినారు. మరి మనపూర్వికులును వారి నాదరించినారు.

మహిషంబుచే వేదమహిమంబు చాటించె
జ్ఞానదే వొకనాఁడు జనులు వొగడ;
భక్తిచే నొప్పు సభంగంబు లొకనాఁడు
ప్రకటించె నామదేవ ప్రభుండు;
చండాలునశనంబు చవిగొన్నయేకనా
థొకనాఁడు మెప్పించె సకల జనుల;
హీనజాతినిఁబుట్టి యొసఁగినరోహిదా
సొకనాఁడు జ్ఞానియై యొప్పెమహిని;

గౌరవము గోలుపోయిరే వారలెల్ల?
వేదపఠనంబు సేయరే విజ్ఞులగుచు?
జ్ఞాన దానంబు సేయరే మానవులకు?
వారి చర్య లపూర్వమై పరగె నొక్కొ?

ఇట్టి మహాపురుషులనందరిని హరిజనులనుటకేమైనా సందేహముందునా?

జయ:- ఇదంతా యుక్తివాదము

బ్రాహ్మ:- ఇతడు బ్రాహ్మణ ద్వేషి.

రామే:- పూర్వపు ముచ్చట అట్లుండనీ. ఏ జాతివారు ఆజాతి ధర్మాన్ని అను సరించవలెనా లేదా? "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అన్నాడు శ్రీ కృష్ణ పరమాత్మ.

తుకా:- స్వాములారా, భక్తవత్సలుండును, శరణాగత రక్షకుండును, ఆర్త త్రాణపరాయణుండును సకలలోక నిర్మాతయు, అయిన భగ వంతుడు జాతిమత భేదములు నిర్ణయింపలేము. ఆ పరమ పురుషుడు ఒక్కొక్క సమయములో ఎట్టిలీలలను ప్రకటించెనో వినుడు.

భక్తకబీరునిపడుగుపైఁ బోగుల
సంధించి నేసినచక్రధరుఁడు,
రోహిదాసుగృహంబులోపలతోళ్లతోఁ
జెప్పులఁ గుట్టిన శ్రీవరుండు,
దామాజిపండితుధర్మంబు గాపాడఁ
దలవరియైయున్నదానవారి,
కుమ్మరికులజుఁడౌ గోరాకు సారెపైఁ
గుండలు కాల్చిన గోత్రధరుఁడు

శబరి యుచ్ఛిష్టమును దిన్నచారుమూర్తి,
విదురునింట భుజించినయదువిభుండు,
బాణువాకిట బంట్రైన ప్రమథపతియు,
జాతి భేదంబు పాటింప జాలిరొక్కొ?

రామే:- ఇదంతా విషయాంతరం. మహాత్ములయొక్కయు, దేవతల యొక్కయు పౌరాణిక గాథలను మేముగూడా వినినాము. అదికాద మేము విచారించునట్టిది. ఇప్పుడీ మహారాష్ట్ర దేశములో జనుల ఆచారాలెట్టివో వాటికనుకూలముగా వర్తించుకొనవలెనా లేదా?

తుకా:- మనము ఏకీభవించి ఆచరించుకొను పద్ధతులే ఆచారములగును. అవికూడా దేశకాలముల ననుసరించి మారుచుండును. ఒకనాడు నియోగాదులు, ద్వాదశపుత్రులు, మాంసభక్షణము మున్నగునవి శిష్ట సదాచారములుగా నుండలేదా? అవి యిప్పుడు నింద్యములైనవి.

రామే:- తుదకు నీవనే ముచ్చటయేమి? శూద్రులకు వేదాధికారము కలదందువా?

తుకా:- అవును. కలదందును. గుణమే ప్రధానముకాని జాతి ప్రధానము కాదు.

అయిత జందెంబువాల్చువాఁడగ్రజుండె?
వేదములుపాడెనంతనె విప్రుఁడగునె?
ధరణి సన్మార్గవర్తియై ధర్మమరసి
పరహితరతుండగునతండె బ్రాహ్మణుండు.

రామే:- ఏమండీ, ధర్మమూర్తులారా, వింటున్నారా ఇతని ధిక్కారవాక్యాలు. ఇతడు పాషండుడు. చార్వాకులపద్ధతిపై వాదిస్తున్నాడు.

జయ:- రామేశ్వరభట్టుగారూ, ఈ చర్చ యింక చాలించండి. అతడీవిషయములో దోషియనే మేమంటున్నాము.

రామే:- సరి, మరొక్కమాట. ఏమయ్యా, తుకారాం. నీవు మాస్వాజీబాబాను ఏల నీ శిష్యులచేత కొట్టించినావో అది చెప్పకపోతివి.

తుకా:- స్వామీ. అది అబద్ధము. నన్నే మాస్వాజీబాబాగారు నిష్కారణముగా హింసించిరి. అటుతర్వాత శంభాజీ ప్రేరణచే కొందరతన్ని కొట్టిరని వింటిని. శంభాజీయే నాకీవార్త తెలిపెను. అది చాలా గొప్ప అపరాధమని అతనితోచెప్పి బాబాగారి క్షమాపణ వేడుకొనుమని బుద్ధి చెప్పితిని.

జయ:- ఇదంతా అబద్ధమేనండి. పాపమా బాబాను కొట్టించుటకితడే కారకుడని ఊరిలో అందరున్నూ అంటున్నారు-

రామే:- తుకారాం. నీవీవిషయములో నిర్దోషివనుటకేమైన సాక్ష్యమియ్య గలవా?

కా:- నాకుసాక్ష్యముతో అవసరములేదు. నేనుసత్యమునే చెప్పుచున్నాను. నమ్మితే నమ్ముడు లేకున్నమానుడు.

రామే:- ఊఁ, సరే. అంతా వినుకొన్నాము. ఏమయ్యా మనమింక తీర్పు చెప్పుదమా.

జయ
బ్రాహ్మ } ఆ కానియ్యండి. ఆలస్యమెందులకు?

రామే:- తుకారాం, నీవు దోషివని మేము నిర్ణయిస్తున్నాము. దానికిగాను శిక్ష చేమెూవినుు. నీవు ఈదేహూ గ్రామమును రేపు సాయంత్రములోపుగా వదలిపెట్టి వెళ్ళిపోవలెను. మరియు నీ అభంగముల గ్రంథములను ఇంద్రాణీ నదిలో పారవేయవలెను.

తుకా:- ఇంతకఠినముగా, ఇంత నిష్కారణముగా తాము నన్ను శిక్షించుట న్యాయము కాదు.

రామే:- మా నిర్ణయము అన్యాయమని అంటావా?

తుకా:- మీకు ఎదురాడజాలను. కాని ఈ దేహూ గ్రామములో నాకు ఇల్లు వాకిలి బంధువులు, మిత్రులు కలరు. పైగా ఇచ్చట నెలకొనియున్న పాండురంగ విఠలస్వామినుండి ఎడబాటును సహింపజాలను. కావున కరుణింపవలెనని ప్రార్థించుకొనుచున్నాను.

రామే:- మాయాజ్ఞకు తిరుగు లేదు. ఇంతటితో ఈ ధర్మాసనముపరిసమాప్తి. ఏమండీ వెళ్లుదాము రండి (ధర్మ నిర్ణేతలు వెళ్లుదురు.)

తుకా:- పాండురంగా, నీ దివ్యలీలలు నాకర్థమగునా? నీ సంకల్పమెటులో అటులే యగుగాక. నీవు అనాడు కలలో నన్ను అభంగాలు వ్రాయుమంటివి. ఈ నాడు అవి ఇంద్రాణిలో పారవేయవలసివచ్చినది. నీ ఎడబాటుగూడా ఏర్పడనున్నది. కాదు. అట్లు ఎన్నటికినీ కానేరదు. నిన్ను నేను వదలను. ఇది బాగా జ్ఞాపకముంచుకొనుము.



# ప్రఘట్టకము ౧౮

ఇంద్రాణీ నదీతీరము.

గంగాధర:— శంభాజీ. విన్నావా మన గురువుల వారిని గురించిన విశేషాలు.

శంభాజీ:- ఏమిటీ అవి సెలవియ్యండి.

గం:- కూర్మిదాసు అనేకాపు తుకారాంగారిపై నేరముమోపి ధాన్యనష్టం కట్టి యిచ్చే అట్లు నిర్బంధించెనట.

శం:- అవును. ఆ సంగతి విన్నాను. ఏమైనది.

గం:- మధ్యవర్తులు ముప్పందుము పండుతుందని అంచనావేస్తే రెండు పుట్ల పందుము పండిందట. కూర్మిదాసు కూడా ధర్మాత్ముడే. ఎక్కువగా పండిన పంటను తుకారాంగారికిచ్చేదానికి వచ్చెను.

శం:- స్వామిగారు తీసుకొన్నారా?

గం:- లేదు. ఎక్కువగా పండిన పుట్టెడు జొన్నలను బీదలకు పంచిపెట్టించినారు.

శం:- ఆహా—ఎంతటి నిష్కామయోగము.

గం:— మరిమొన్నటి సంగతి విన్నావా?

శం:— ఏమది?

గం:- తుకారాంస్వామి ధర్మవిరుద్ధముగా ప్రవర్తించినారని ధర్మనిర్ణేతలు వారిని గ్రామమునుండి వెళ్లగొట్టినారు. వారి గ్రంథాలను ఈ యింద్రాణిలో పారవేయుట కాజ్ఞాపించినారు.

శంభా:- అదినాకు తెలియును. కాని తర్వాతి సంగతి తమకు తెలియనట్లున్నదే!

గంగా:- కొంత కొంత తెలుసునులే. అయినను నీనోటనే వినదలచినాను. తెలుపుము.

శంభా:- బ్రహ్మసభగా నేర్పడిన ముగ్గురు బ్రాహ్మణులు మహాత్మా తుకారాము నాయనగారిపై అబద్ధనిందలను మోపిరి. వానికేమి సాక్షులు లేరు. మహాత్ములుకూడ సాక్షులను కోరలేదు. వారి సమాధానములను నిర్హేతుకముగా అబద్ధములని త్రోసివేసి అర్థములేని శిక్షలు వేసిరి.

గంగా:- అదంతయు విన్నాను. తర్వాతి సంగతేమి?

శంభా:- తర్వాత గ్రామప్రముఖులు, భక్తులు, గుంపులు గుంపులుగా పటేలు గారింటిని ముట్టడించి మహాత్మాగారికెవిధమైనబాధ కలిగినను మేము సహింపమని అల్లరిచేసిరి. కొందరు మాస్వాజీని ముట్టడింపగా అతడు తానేమియు చేయలేదనిచెప్పి పటేలువద్దకువెళ్ళి తుకారామస్వామిపై తనకేమియు పగలేదనియు, అతడు నిర్దోషియనియు తెలిపిపోయెను. పలువురు గ్రామమువదలి తుకారాం మహాత్ముని వెంటనే పోదు మనిరి. మరికొందరు ఛత్రపతి శివాజీ మహారాజుగారివద్ద మొర లిడుదుమని సిద్ధమైరి. ఇదంతయు నొకయెత్తుకాని పటేలుగారి సంగతి యొకయెత్తుసుమా!

గంగా:- అదేమి?

శంభా:- పటేలుగారికి నిన్నరాత్రి కలలో శ్రీ పాండురంగస్వామి కనబడి మహాత్మా తుకారామస్వామిపై అన్యాయముగా విధించిన శిక్షను తత్ క్షణమే తొలగించుమని ఆదేశించిపోయెనట.

గంగా:- చాలా చిత్రము. పటేలుకూడా ధన్యుడైనాడు.

[ తుకారాం భజనచేయుచు ప్రవేశించును. వెనువెంట విఠోబా, జిజీ బాయి, సుందరి మరికొందరు దీనాననులై, వత్తురు ]

తుకా:-

పిల్లకోయిలల్ జనులకు బ్రీతిఁగూర్చుఁ
గాకిపిల్లలు కడుముద్దు కాకములకె
ఇతరకవిరాజులల్లినకృతులరీతి
వెలయకున్న నాకవితయే ప్రియమునాకు.

ఈ నాయభంగముల గ్రంథమును ఇంద్రాణీనదిలో పారవేయుటకు చేతులాడకున్నవికదా. నాభక్తి రసమంతయు ఈ ప్రవాహములో కొట్టుకొని పోవలసినదేనా? ధర్మాసనమున ధర్మమూర్తులు నిర్ణయించిన నిర్ణయమును ఉల్లంఘించుట మహాపాతకముకదా. ఓ యింద్రాణీ, నీవింతవరకు పాండు రంగని సేవకురాలవని నమ్మితిని. కాని నీ కుటిలప్రవర్తన మిప్పుడు కదా వెల్లడియయ్యెను. పాండురంగా ! నీవునన్నేల వృథాశ్రమకు పాలుసేసితివి. అభంగముల రచించుటకు నీదే ఆదేశము. మరియిప్పుడు వాటికి జలసమాధి

కావించుటకును నీదే ఆజ్ఞయైనది. నన్నెన్నిమారులని పరీక్షింపనెంచినావు. ఇదిగో ఏమాత్రమున్నూ జంకక నీయాజ్ఞను నెరవేర్చుచున్నాను. కవిత్వమా! నీకును నాకును నేటితో ఋణానుబంధము తీరిపోయినది.........ప్రపంచ కామితములన్నింటినీ త్యజించుచూ వచ్చిన నాలో ఈ రచనలు ఎంతటి దుర్మోహమును కలిగించినవి. నారచనలు లేకుంటే ప్రపంచానికి లోటు కలుగునా? ఎందరోమహానుభావులు లోకసముద్ధరణార్థమై తమజ్ఞాన సర్వస్వమును అనుగ్రహించి పోయి యుండగా అగర్భదరిద్రుడనగు నేను అంత కన్న నెక్కువ సమర్పించు కొనగలిగినదేమియును లేదు.

గంగా:- మహాత్మా తుకారాం గారూ ! మీరు చాలా ఖిన్నులైనారు. మీకు చాలా అపచారము జరిగినది. దీనికి ప్రతీకారమే లేదా?

తుకా:- నాకేమియు విచారములేదు. నన్నుకొద్దిగా ధ్యానముచేసుకొననిమ్ము. (స్వగతము) ప్రియ జనకా, పాండురంగా !

దేవ ! యోజగన్నాథ ! యోదీననాథ !
సాధురక్షక ! భక్తవత్సల ! రమేశ !
నీకృపాతిశయంబున నియతితోడఁ
బ్రతుకఁగంటిని జగతిలోఁగుతుక మెసఁగ.

♦ ♦ ♦ ♦

క్షుత్తుచే వేధలొందిన క్షేభలుడిపి
దుష్టబాధలఁ బొగిలినఁ దుష్టినిచ్చి
చెట్టబాటలు త్రొక్కిన శిక్షచేసి
కాచుచుంటివి తండ్రివై కరుణతోడ.

♦ ♦ ♦ ♦

సాధుగణముల సేవించు జనుఁడనేని
జీవకోటుల హింసను జేయనేని,
ఒరుల ధనములఁ గోరక యుంటినేని,
నీదుకరుణకుఁ బాత్రుండ నీరజాక్ష !

♦ ♦ ♦ ♦

జగతిలోని జీవనమింక చాలు; నన్ను
జేరి భవదీయ సన్నిధిఁ జేర్చికొనుము.
సంకటంబుల నిండిన జన్మమొల్ల.
లయము నొందింపు నీకాంతి రాశిలోన

♦ ♦ ♦ ♦

ప్రియసోదరులారా ! పెద్దలయాజ్ఞ పాలించువాడనై నా రచనల నన్నింటిని మీరందరును సాక్షులుగా నుండగా ఈ యింద్రాణీ మాత గర్భమందు వేయుచున్నాను.

[పటేలు—పలువురు జనులు ప్రవేశింతురు]

పటేలు:- మహాత్మా, ఆగు ఆగు. పారవేయవలదు. వలదు. (పటేలు సాష్టాంగపడి తుకారాము పాదములకు మ్రొక్కును.)

విఠోబా:- జై—మహాత్మా తుకారాం స్వామికి. (అందరును జయధ్వానములు చేయుదురు. తెరలోపల పలువురి అనుకరణము)

తుకా:- పటేలుగారూ. మీ యాజ్ఞను మీరే యుపసంహరించుకొనుటయేల?

పటేలు:- నాకు దివ్యాదేశమైనది. ఆ వివరములు మరొక మారు విశదీకరింతును. పైగా ప్రజలందరు తమరిని ప్రేమించినవారగుటచే చాలా బాధపడుతున్నారు. మరి పంచాయతీసభవారి తీర్పు అక్రమము, నియమ విరుద్ధము. అశాస్త్రీయమని స్పష్టపడినది. కాన నాతప్పును, పంచాయతి తప్పును తాము క్షమింపవలెనని మరొక మారు మీకాళ్లను ఆశ్రయిస్తున్నాను.

వి:- మహాత్మా తుకారాముకూ జై (ఇతరులానినాదమందుకొందురు)

తుకా:- ప్రభూ ! మీమొదటి యాజ్ఞ కీదాసుడెట్లు బద్ధుడో ఇప్పటి యానతి కినీ అటులే ! కానిండు. ఇదంతయు పాండురంగని లీలయే. నాకు తెలిసినదిలెండి ! !

భక్తులారా. ఇక మరొక్క సారి ఆ సాధు రక్షకుని, ఆ జగన్నాటక సూత్రధారుని భక్తి కొలది మంగళముగా స్మరించండి.

శంభా:- జయ పాండురంగా!

గంగా:- జయ విఠ్ఠల్!

(అందరును జయ విఠ్ఠల్, హరి విఠ్ఠల్" అని ధ్వనింతురు)

(తుకారామ మహాత్ముని చుట్టును తిరుగుచు భజన చేయుచుందురు.)

మం గ ళ ము

---

# అనుబంధములు

తుకారాము స్వయముగా రచించిన అభంగములను కొన్నింటిని తెనుగు అర్థముతో నిందు పొందుపరుచుచున్నాను. నాటకప్రదర్శనమందు అవసరమని తలచినవారు తుకారాం పాత్రతో నీ క్రిందివి గానము చేయింప వచ్చును—ఈ క్రిందివన్నియు మరాటీ అభంగములు—

## ౨ వ ప్రఘట్టకము

నమో ఆదిరూపా ఓంకారస్వరూపా
విశ్వచియారూపా పాండురంగా ౧
తుఝ్యానత్తేనే తుఝెగుణగావూ
తేణేసుఖీరహూ సర్వకాళ ౨
తూచశ్రోతావక్తా జ్ఞానసీఅంజన
సర్వహెరాణే జాణేతుఝ్యాహాతీ 3
తుకాహ్మణే జేథేనాహీమీతూపణ
నమావే తేకోణే కవణాలాగీ. ౪

హే పాండురంగా, నీవు ఆదిరూపుడవు, ఓంకార స్వరూపుడవు. విశ్వ రూపుడవు, నీకు నమస్కారము. నీ శక్తిచేతనే నీ గుణములను గానము చేయుదును. నీ కృపచే సర్వకాలమందు సుఖుడనై యుందును. నీవే శ్రోతవు, వక్తవు. జ్ఞానమునకు మూలము. అన్నియు నీచేతిమీదుగా నడుచున్నవి. నీకును నాకును భేదములేదు. నేనెవ్వరికి నమస్కరింతును.

కృష్ణ విష్ణు హరి గోవింద గోపాల
మార్గ హా ప్రాంజళ వైకుంఠీచా ౩
సకళాంసీ యేథే అహే అధికార్
కలియుగీ ఉద్ధార హరినామే. ౪
తుకాహ్మణే నామాపాశీ చారీముక్తి
ఏసే బహుతా గ్రంథీ బోలియేలే ౫

ఓ జనులారా ! మీ పాదములంటి మిమ్ము ప్రార్థిస్తున్నాను. మీరు చేతులతో తాళమువేసి నోటితో భగవన్నామమును ఉచ్చరించండి.

విఠ్ఠల విఠ్ఠల అని పలుమారు పల్కుడు. హరిభజన వలన కలిగె ఆనందము స్వర్గమందును కలుగదు. కృష్ణ, విష్ణు, హరి గోవింద, గోపాల, అని హరినామ చింతనము చేయుటయే వైకుంఠమునకు పోవు మార్గము. అందరికిని హరినామ స్మరణ చేయుట కధికారమున్నది. కలియుగములో హరినామ కీర్తనమే అందరినీ యుద్ధరించును. హరినామ చింతనమే సారూప్యాది నాలుగు ముక్తులను ప్రాప్తింపచేయునని అనేక గ్రంథాలు చెప్పుచున్నవని ఈ తుకారాం అంటున్నాడు.

# సు. ప్రతాపరెడ్డి గ్రంథములు

౧. యువజన విజ్ఞానము 3-౦-౦

౨. ప్రజాధికారములు ౧-౮-౦

3. భక్త తుకారాం ౧-౦-౦

౪. హైందవధర్మవీరులు ౧-౮-౦

ప్రాప్తిస్థానము :-

సు. ప్రతాపరెడ్డి

తుల్జాగూడ,

హైదాబాదు దక్కన్.